# విశ్వామిత్రమహర్షి

గ్రంథకర్త్రి:

కనుపర్తి వరలక్ష్మమ్మ



 వెల ౦—౮—౦.

# అంకితము

ఏ పూజ్యచారిత్ర మింపారఁ బఠియింప
గల్గునాకెనలేని కౌతుకఁబు
ఏ ధర్మమూర్తిని నేపార భజియింప
మన్మనో వ్యథలెల్ల మాయుచుండు
ఏ పుణ్యవర్తన మేపారిద్దు నామది
కాదర్శపాత్రమై యలరుచుండు
ఏ మహా మహిమాఢ్యు నింపొంద నాపాలి
యిష్ట దైవంబుగా నెంచు చుండు

నట్టి జానకీ రామున కమల మతికి
నాదు నచ్చిన స్వామికి నవ్య దివ్య
కౌశిక చరిత్ర విరచనా కారణునకు
నర్పణముసేతు నీ గ్రంథ మధికభక్తి.

# పీఠిక

బ్రహ్మర్షియగు విశ్వామిత్రుని చరిత్ర మహోత్కృష్టమైనది. ఇమ్మహర్షి నిశితమైనబుద్ధియు, నిర్మలమైన నంతఃకరణమును గలవాఁడు. అసదృశత్యాగి, యకుంఠితకార్యదీక్షాపరుఁడు. నిజమిట్లున్నను నీ మహానీయుఁడు హరిశ్చంద్రుని సత్యశీలమును బరీక్షించుటకై యాతని యెడ మిగులఁ గఠినముగాఁ బ్రవర్తించిన గాథయొండు మన దేశమున విశేషముగా వ్యాప్తి యందుండుటచే దానిని బట్టి యీయన మిక్కిలి మూర్ఖుఁడనియు, ముక్కోపియనియు, యుక్తాయుక్త విచక్షణా శూన్యుఁడనియు, దయావిహీనుఁడనియు లోకులనుకొనుట పరిపాటియైనది. కాని విశ్వామిత్రుని చరిత్రమును సాకల్యముగా బరికించినచో నీలోకప్రవాద మహేతుకమని స్పష్టమగుటయే గాక అనదల గాచుటకును, నాపన్నుల రక్షించుటకును, పతితుల నుద్ధరించుటకును నకుంఠిత దీక్షతో బాటుపడిన కృపాపరుఁడనిగూడ తెల్లమగును.

మఱియు నీ విశ్వామిత్రుని జీవిత మాతని రాజరికముతోను, నాతని తపోవిభవముతోను ముగియక యానాటి బ్రాహ్మణాబ్రాహ్మణ వివాదములు, అగ్రజాంత్యజ విభేదములు పశుబలాత్మబల తారతమ్యములు మున్నగు సాంఘిక విప్లవములకు గూడ సంబంధించినదై యున్నది.

ఈ కాలము నందువలెనె యాకాలమునందుగూడ కుల విభేదములు నిక్కచ్చిగా నుండవలయునని వాదించెడు సనా

తన ధర్మపరులు గలరనియు, విశ్వామిత్రుఁడు వారితో బోరాడి మానవ సంఘమంతయు నొక్కటి, గుణకర్మలచేత మానవుఁడేపదమునైనఁ బొంద నర్హుఁడను ధర్మమును సాధించెననియు విశ్వామిత్రుని చరిత్రము వెల్లడించుచున్నది.

ఇట్టి మహాసంస్కర్తయగు విశ్వామిత్ర మహర్షి సచ్చరిత్రమును నేను తొలుదొల్త శ్రీమదాంధ్ర వాల్మీకి రామాయణమున జదివి యద్భుతమునొంది, ఇది ప్రత్యేకముగా ప్రకటింపఁదగినదని భావించితిని. తరువాత మఱికొన్ని పురాణ గ్రంథములను గూడ జదివి యీ చరిత్రమును వ్రాసితిని. దీనిని వ్రాసి దాదాపు అయిదువత్సరములైనది. భగవదనుగ్రహమువలన నేటికి దీనిని వెలువరింపగలిగినందులకు సంతసించుచున్నాను. ఈ గ్రంథమును విరచించుటకుఁ దోడ్పడిన గ్రంథములకును గ్రంథకర్తలకును నా భక్తిపూర్వక నమస్కృతులర్పించుచున్నాను. అజ్ఞానంబుననేమి ప్రమాదంబుననేమి యిందుఁ బొసఁగిన దోసఁగులనెల్ల క్షమించి ప్రాచీన సాంఘిక పరిస్థితుల విశదీకరించు నీ మహర్షి చరిత్ర మాంధ్ర మహాశయులెల్ల రాదరింతురని నమ్ముచున్నాను.

ఇట్లు,
గ్రంథకర్త్రి
కనుపర్తి వరలక్ష్మమ్మ.

బాపట్ల
౦౬-౬-33

# విశ్వామిత్ర మహర్షి

## మొదటి ప్రకరణము

శ్రీకరమై, నిరవధిక తపస్సంపన్ను లగు తాపస శ్రేష్ఠులకును, నిత్య సత్యవ్రతు లగు రాజన్య చూడామణులకును, నిరతిశయ సౌశీల్య ప్రభాన్విత లగు సాధ్వీ మతల్లులకును నిలయంబై విరాజిల్లిన మన భరతవర్షంబున మున్నొకప్పుడు కుశికవంశ సంభూతుండును, మహోదయ నగరాధీశ్వరుండును నైన గాధి యను రాజేంద్రుడు రాజిల్లుచుండెను. సకల సద్గుణ గరిష్ఠుండును, సమస్త ధర్మనిష్ఠుండును, సజ్జన స్తవనీయ చరితుండును నగు నా రాజన్య శ్రేష్ఠునకు సత్యవతి యను నొక్క పుత్రికా రత్నముండెను. ఆ కన్యకామణి వయోరూప విద్యా సౌజన్య విశేషంబుల నలనాటి రాచకన్నెలలో నెల్ల మిన్నయై తల్లిదండ్రులకును గాదిలి నెచ్చెలులకును ప్రేమ భాజనయై భాసిల్లుచుండెను.

గాధిరాజును సర్వలక్షణ లక్షిత యగు నక్కుమారికామణి యెడల నత్యంత వాత్సల్యము గలిగి యౌవన ప్రాదుర్భావంబున నొప్పారెడి యా బాలికామణి కనురూప వరుని సమకూర్ప నన్వేషించుచుండెను.

అట్టి యెడ భృగువంశసంజాతుండును పరమనైష్ఠికుండును నైన, ఋచీకుం డను ముని ప్రవరుఁడు బ్రహ్మచర్య నియమవ్రతుఁడై పెక్కేండ్లు గురుని కడ నధ్యయనంబు సేసి సమావర్తనముఁ బడసి దేవ పితౄణంబులఁ దీర్ప తలఁపు కలుగ గృహస్థాశ్రమ ప్రవిష్టుఁడుగా నిశ్చయించి యుత్తమ వంశాభిజాత్య యగు కన్యకారత్నమునకై యన్వేషించుచు, గాధిపుత్రియైన సత్యవతి వయోరూప సౌశీల్యాదుల విని యెవ్విధంబుననేని నబ్బాలామణినిఁ బత్నిగాఁ బడయ నెంచి గాధిధరాధిపుని కడ కేతెంచి,యాతనిచే సత్కృతుండై యుచితాసనంబున నుండి "రాజేంద్రా! మీ కుమారికయైన సత్యవతిని నా కిచ్చి పాణిగ్రహణము సేయు"మని యడిగెను. అడిగినంతనే యనన్య సామాన్యగుణ రూప శోభిత యగు తన పుత్రికారత్నము నే రాజమార్తాండునకో యొసంగి యానందింప నూహించుచున్న యాగాధి భూజాని కా మునివరు ప్రశ్నంబశనిపాతమై యుల్లము జల్లన డిల్లవోయి కొంతవడికిఁ దెప్పటిల్లి తెలివిఁ దెచ్చికొని సుకుమార సుందర సుమకోమల గాత్రి యగు తన పుత్రికను నిష్ఠుర నియమవ్రతుఁ డగు నా బాపనతాపసి కీయ మన సొప్పక యటుల నీయ ననిన నా భూసురుఁ డేమి శపించునో యని శంకించి యేనెపంబున నేని యా మునివరు నంపివేయ నెంచి గాధిమహీపాలుఁ డామహీదేవున కిట్టు లనెను. "మహాసీయా! నిఖిల నిగమకోవిదుండవును, నిరుపమ తపోగరిష్ఠుండవును, నియమ వ్రతుండవును నగు నీవు నా కొమరితను గోరుటచే నేను ధన్యుఁడ నైతిని. కాని నా

కన్యకా వివాహ విషయమున నా దొక్క యేర్పాటు గలదు. అ దెద్ది యన తెల్లనిమేనులును నల్లని చెవులును గల వేయి యుత్తమాశ్వంబుల నెవ్వఁ డస్మత్కన్యక కుంకువుగా నొసంగు నాతనికి నా కొమరిత నీయవలె నని నిశ్చయించితిని. కాన నా గోరిన హయంబులఁ దెచ్చి యొసంగెద వేని మదీయ పుత్రికను మీకు వివాహంబు సేయుదు." మహారా జిట్లు లన వల్లె యని ఋచీకుఁడు నిజాశ్రమంబున కరిగి విధి పూర్వకంబుగాఁ బ్రచేతసుని బ్రార్థించి యాతని వలన గాధి భూధవుండు చెప్పిన యాకృతి గల సహస్రాశ్వంబులఁ బడసి వానిని గొనివచ్చి గాధి కొసంగెను. ఇఁక ఋచీకుని యభీష్టము నిరాకరింప వెఱవఁగానక గాధి సత్యవతి నా ఋషివరున కొసంగి పాణిగ్రహణము చేసెను. సత్యవతియు రాజపుత్రి నగు నే నేడ? ఈ బీద బాడబుని పత్ని నగు టేడ యని డెందంబున నేని గుందక రాజమర్యాదల నెల్ల వీడి భోగంబు లుజ్జగించి విప్రధర్మంబుల స్వీకరించి తపోనిరతుఁడైన భర్తను మహా భక్తిభావంబున సేవించుచుండెను. ఇట గాధియు, నాతని పత్నియు, సత్యవతి దైవికంబుగా విప్రుని యిల్లా లగుటయు, తమ కిఁక వేఱు బిడ్డలు లేకుండుటయుఁ దలంచి మహనీయంబగు తమ కుశికవంశ మిఁకఁ దమతో నంతరించెనో యని దురపిల్లుచుండిరి. అట్టి యెడఁ బరేంగితజ్ఞ యగు సత్యవతి జననీ జనకుల మనఃక్లేశ మెఱింగి తన పెనిమిటియైన ఋచీకునిఁ జేరి ప్రాంజలియై "మహాత్మా! మా తలిదండ్రులకుఁ దనయులు లేరు. ఏక పుత్రిక నైన నేను భవత్పత్ని నైన కతంబున దౌహిత్రి

లాభంబున నేనిఁ బూజ్యంబైన యస్మజ్జనక రాజ్యంబునకు భవిష్యత్ప్రభుడు పూజ్యం బగు నటులఁ దోఁచెడిని. కావున మహా నీయ ప్రభావుల రగు తాము మాయందు కృపామతిఁ జేసి యధ్యయన ధ్యాన తపోనియమంబుల భవత్సదృశుం డగు సుతుండు నాకును, బాహు బల విక్రమంబుల మాతండ్రినిఁ బోలు తనయుఁడు "అపుత్రస్య గతిర్నాస్తి"యని యల్లాడు యస్మజ్జననికిని గలుగునట్టు లేదేనిఁ గ్రియ యొక్కటి మాచేఁ జేయింప వేఁడెద ననెను.

ఇట్లు సత్యవతి దీనయై ప్రార్థింప నామెయందలి యను రాగ గౌరవంబుల పేర్మిని నామె మొడఁ బ్రసన్న చేతస్కుఁడై బుచీకుఁ డామె కోరిన క్రతువు నెఱప యంగీకరించి గాధి పత్నిని దమ యాశ్రమంబునకు రావించి క్షత్రియోచిత మం త్రంబుల గాధి పత్నికిని విప్రోచిత మంత్రంబుల నిజపత్నికిని వ్రేలిమి జరిపించి బ్రహ్మ మంత్రంబుల వ్రేల్చిన చరువు నీ వందుకొని క్షాత్రమంత్రంబుల వ్రేల్పించిన చరువు మీయమ్మ కిచ్చునది యని బుచీకుఁడు భార్యయైన సత్యవతికిఁ జెప్పి స్నానార్థియై నదికిం జనెను. ఆసమయంబునఁ దల్లి యనుగుటచేఁ బ్రమాద వశంబున సత్యవతి తల్లి హవ్యము తా నందుకొని తన హవ్యము తల్లి కొసంగెను. ఇంతలో బుచీకుం డరుదెంచి యొకరి చరువు లొకరు గైకొనుట గ్రహించి భార్యను జూచి "సతీమణీ! ఎంత పొరబాటు సేసితివి! బ్రహ్మ మంత్రంబుల వేల్పించిన హవ్యము మీ యమ్మ కొసఁగి క్షాత్రమంత్రంబుల వేలిపించిన హవ్యము నీవు గైకొంటి వేఁ? దీన బ్రహ్మవి

డుండగు తనయుఁడు మీా జననికిని కఠినతర క్షాత్ర ధర్మా వలంబి యగు పుత్రుఁడు నీకును జనియింతురు సుమీా!" యనెను. భర్త యిట్లు చరువు విడ్వడుట వలని ప్రమాదంబు తెలుప వలవలలాడుచు సత్యవతి "మహాత్మా! క్రూరుండగు తనయుని భరింపఁజాల నెవ్విధంబుననైన నాయీా మొగులు మాన్పు మని వేఁడికొనెను. భార్య యిటుల వేడికొన ఋచీకుఁ డామెయం దనుగ్రహించి నీ పుత్రుఁడు గాక పౌత్రుఁడు క్షాత్రధర్మాచారుండగు దుఃఖింపకు మని యోదార్చెను.

అంతఁ గొన్ని దినంబులకు తల్లి కూతుం డ్రిరువురును గర్భంబులఁ దాల్చిరి. భార్య గర్భవతియైనందుల కెంతయు నుప్పొంగి గాధిరాజేంద్రుఁడు పుంసవన సీమంతాది భవ్య కర్మంబు లెల్ల విధ్యుక్తంబుగా జరిపించి కుమారోదయ మెప్పు డెప్పు డని యెదురు చూచుచుండెను. ఇట్లు రాజేంద్రుఁ డత్యంతానందమున నుండ నవమాసంబులు పరిపూర్ణంబైన నొక్క శుభదినంబున గాధి పత్ని సుఖంబుగాఁ బ్రసవించి యనదృశ తేజుండగు నొక్క పుత్రరత్నమును గనెను.

బహుకాలంబునకుఁ గల్గిన పుత్రలాభంబున కెంతయు నుప్పొంగి గాధిరాజేంద్రుఁ డమూల్య రత్నాంబరాభరణాములను ననంఖ్యాక సువర్ణ నిష్కంబులను, దక్షిణా పూర్వకంబుగా ననేక గోసహస్రంబులను బ్రాహ్మణులకు దానంబు సేసి పురంబున మహావైభవోపేతముగాఁ బుత్రోత్సవము జరిపించెను. అంత నేకాదశదినంబున కష్టశోభనంబులు సేసి

పుత్రియుత యగు పత్నిని సుస్నాతను గావించి బాలునకు జాతకర్మాది భవ్యకర్మంబులు నడిపి "విశ్వామిత్రుఁ"డని నామకరణము చేసి యష్టాదశజాతులకుఁ జెందిన పౌరులెల్లర నిష్టమృష్టాన్నముల చేతను బహువిధోపచారముల చేతను దనియుంపఁజేసి గాధి రాజేంద్రుఁడా కుమారోపలాలన లీలాహాసవినోదంబులఁ బ్రొద్దులు పుచ్చుచు సుఖంబున నుండెను.

అటు ఋచీకాశ్రమంబున సత్యవతియుఁ దల్లి ప్రసూతియైన కొన్ని దినంబులకు బ్రహ్మతేజో విరాజితుండైన యొక్క కుమారునిఁ గనెను, అతఁడే సప్తర్షులలోఁ గనిష్ఠుండగు జమదగ్ని. నిరుపమ ధ్యానసుఖైకతత్పరుఁడును, శమదమాది షట్క సంపన్నుడును నైన యా జమదగ్ని ఋషివరు తనయుఁడే పరశురాముఁడు. ఆతఁడు ఋచీకుఁడు వచించిన చందమున క్షాత్రధర్మం బవలంబించి కార్తవీర్యులతో నైన కయ్యంబు కారణముగా క్షత్రియులయెడఁ బగఁబూని జగంబునఁ గల క్షత్రియుల నెల్లర ముయ్యేడు మాఱులు వధించెను.

సత్యవతియు సమస్త విధముల ఋచీకుని సహధర్మిణియై పెక్కండ్లాతని మది మెచ్చునటుల గృహిణీధర్మములు నెఱపి యనంతరము నిజ సౌశీల్యతా ప్రభావంబున బొందితో స్వర్గమున కుద్గమించి యటనుండి లోకంబులకుఁ బ్రీతిసేయ మహానదియై హిమవద్భూధరంబునకు దిగి భువికిఁ బ్రవహించెను. సత్యవతి కుశికవంశ సంభూత యగుటంజేసి యమ్మహానది 'కౌశికి' యను నామంబున బ్రసిద్ధమయ్యెను.

## రెండవ ప్రకరణము

ఇటు విశ్వామిత్ర కుమారుండును నెల్లర కళ్లారు ముద్దుగాఁ బెరుగుచుఁ దన యవ్యక్త క్రీడాసల్లాపంబులచేఁ దల్లిదండ్రులకు నేత్రోత్సవంబును గర్ణపేయంబును గావించుచు పరమాహ్లాదకరుఁడై విశాల ఫాలతలంబున బ్రహ్మతేజంబును నిడుద బాహువుల క్షాత్ర తేజంబును బ్రస్ఫుట మగుచుండ నెడతెగని శ్రద్ధయు, విడువని పూన్కియు, నైజ గుణంబులుగా బ్రహ్మక్షత్రియ తేజంబులు కరగిపోసిన విగ్రహంబునాఁ బెంపొందుచుండెను.

ఇట్లు క్రమ క్రమంబుగా విశ్వామిత్రునకు శైశవంబుగ గాధిమహీజాని నిర్ణీత వర్షంబుల నన్నప్రాశన కర్ణవేధాక్షరాభ్యాస చౌలాది భవ్యకర్మంబులచే సంస్కృతుం జేసి యేకాదశ వర్షంబున క్షత్రియ కులోచితంబుగా నుపనీతుఁ గావించి విద్యాకుశలునిఁ జేయ నెంచి యధ్యయనార్థము గురుని కప్పగించెను. ఇట్లు పితరునిచే గురుదత్తుండై విశ్వామిత్రుఁడు భయభక్తి యుక్తుండై గురుని సేవించుచు నాతఁడు చెప్పిన చొప్పున వర్తించుచు నాతఁ డుపదేశించిన చందమున నధ్యయనంబు సేయుచు క్షత్రియ వ్యాపారంబులైన ధనుర్వేదాది విద్యలయందు కంటె వైదిక విద్యలయం దెక్కుడాసక్తిఁ జూపుచుండెను. రాజోచిత విద్యలయందలి వైముఖ్యంబును బ్రాహ్మణ విద్యలయం దనురాగంబును జూపుచుండెడి వర్తనంబును గని గాధి రాజేంద్రుఁడు "ఋచీకుని వచనంబులు

వీనియందు నిక్కువమై కనుపట్టుచున్న" వని మనంబునఁ గళవళముఁ జెంది వేదాధ్యయనంబుతోఁ బాటు ధనుర్వేదంబు గఱప నస్త్రాచార్యుని త్రివర్గోపదేశకులగు దేశికులను నియమించి సర్వవిద్యా పారంగతునిగాఁ జేయుచుండెను.

మహామేధావి యగు గాధి తనయుఁ డనతికాలంబులో నన్నిటఁ గుశలుండై జననీ జనకులకును నాచార్యులకును ముదంబుఁ గూర్చెను. ఇట్లు సమస్త విద్యావిశారదుండై యౌవనంబున నొప్పారెడు తనయునిం గని గాధి భూపతి హర్ష నిర్భర చేతస్కుండై యుత్తమ వంశ సంజాత యగు నొక్క రాజ కన్యకను దెచ్చి కుమారునకుఁ బరిణయంబు సేసి నిఖిల ధరా రాజ్యంబును నాతనికిఁ బట్టంబు గట్టి విశ్రాంతుఁ డయ్యెను.

ఉత్తమ గుణశోభిత యగు నాపట్టమహిషివలన విశ్వామిత్ర మహీపాలున కష్టక, హారత, జయంత సుమదాదులు నూర్వురు పుత్రు లుదయించిరి. ఇట్లు పైతృకం బగు రాజ్యంబును నిజవంశ విస్తారకు లైన తనయులను, బడసి జనరంజకంబుగాఁ బరిపాలనంబు సేయఁ జాలిన బుద్ధిబలంబును శాత్రవ మర్దనంబు సేయఁ జాలిన బాహుబలంబును గలిగి గర్వితుండు గాక విశ్వామిత్రుఁడు సజ్జన స్తవనీయ చరితుండును నుత్తమ ధర్మనిష్ఠుండును నై జగంబులు మెచ్చ నేల యేలుచుండెను. ఎదిరించి యోడని శాత్రవుండును, శరణుచొచ్చి రక్షింపఁబడని శరణాగతుండును, నర్థించి నిరాకృతుఁడైన యర్థియు నామహీపాలుని పాలనంబున కంచు కాగడా వేసి వెదకినను గానరాకుండిరి.

## మూడవ ప్రకరణము

ఇట్లు పెక్కేండ్లు కడచన నొక్కనాడు విశ్వామిత్ర మహావల్లభునకు నిఖిల ధరావలయంబుఁ గ్రుమ్మరఁ గుతూహలంబు గలిగెను. తలఁచిన కార్యంబు నాక్షణంబున నెఱవేర్చు పూన్కి విశ్వామిత్రునకు వెన్నతోఁ బెట్టినదిగాన వెంటనే రాజ్యభారంబు నాప్తులగు సచివులకు వశపఱచి సతీపుత్ర మిత్రామాత్య భృత్య సేనాసమేతంబుగ భూసంచారము సేయ నాయత్తుఁడయ్యెను. చండశాసనుఁడగు నాతని సంకల్పమును మాన్ప నెవ్వరికిని సాధ్యముకాదయ్యె. తత్క్షణమే భార్యాపుత్రులు పయనమైరి. భృత్యు లాయత్తులైరి. చతురంగ సేనలు సిద్ధపడియె. ఇటు లపార సేనావాహిని వెంటరా మహా వైభవంబునఁదరలి విశ్వామిత్ర భూవరుఁడు నానాదేశంబులఁ గ్రుమ్మరుచు నాయాదేశంబులఁ గల సృష్టి వైచిత్ర్యంబులను, భాషా విశేషంబులను, బ్రజల నడవడులను, గమనించుచు, నందందుఁ బొడ సూపెడు జానపదుల యమాయకత్వంబులును, పట్టణవాసుల కపట తంత్రంబులును, నాటవికుల మౌఢ్య చేష్టితంబులును, మునిపల్లెలలోని యాశ్రమ వాసుల వినీత వర్తనంబులును నరయుచు చనిచని యొక్కనాడు దైవికంబుగా వసిష్ఠాశ్రమంబుఁ దరియం జొచ్చెను.

ఇట్లు వసిష్ఠాశ్రమ ప్రాంతమునకు వచ్చినంతనే మహనీయుఁడగు వసిష్ఠమౌనీంద్రుని మహా ప్రభావంబులు పెక్కులు మున్నే వినియున్నవాఁడు గావున నమ్మహర్షిని

దర్శింప విశ్వామిత్ర భూపతికిఁ గుతూహలంబు కలిగెను. కాన నాతఁ డాశ్రమవాసుల కనిరోధంబుగా నుండు నట్లు చమూసమూహంబుల దూరంబున నిలిపి పాదచారుండై వివిధ పాదప సందోహ సంశోభితంబును, నానావిధ మృగ పక్షి వితాన విభ్రాజితంబును, సాధు కురంగ జాలాలంకృతంబును, దేవదానవ సంఘాత సంకీర్ణంబును, తపోవిభవసంపన్నులైన యగ్నికల్పులగు దేవర్షి బ్రహ్మర్షి రాజర్షి గణ విరాజితంబును నై మహాప్రభావంబున విలసిల్లు నా వసిష్ఠాశ్రమంబునఁ బ్రవేశించి అహో! ఈ వసిష్ఠ మహామునీంద్రుని తపోవైభవం బింత యొప్పునే యని యక్కజం బందుచుండ నాతని యాగమనం బును విని వసిష్ఠుండు ముదితుండై సగౌరవంబుగా నాతని నెదుర్కొని యథోచిత మర్యాదల సంభావించెను. విశ్వామిత్రుఁడును నా సంయమిచంద్రునకుఁ బరమ భక్తి తాత్పర్యంబులఁ బ్రణమిల్లి దీవన లంది యాతఁడు చేసిన సత్కారంబు లందికొని యుచితాసనంబున నాసీనుఁడై యా మునివరునిం గాంచి "మహానిసత్తమా! తమకు క్షేమమే? తమ హోమాదికంబులు చక్కగా జరుగుచున్నవే? భవత్తపోజ పాదులు నిర్విఘ్నంబుగా నెఱవేఱెడినే? తమ యాశ్రమ పాద పావళులు ఫలపుష్పసమృద్ధంబులే"యని సాదరమున నడిగె. ఇట్లు లింపు మీర బ్రశ్నించెడి రాజేంద్రునిఁ గని మందస్మిత వదనారవిందుఁడై యరుంధతీధవుండు "రాజేంద్రా! మీ వంటి ధర్మతత్పరు లగు ప్రభులపాలనంబున నున్న మాకు దోసఁగులు పొసఁగునే? మాఘాత్రులును మేమును క్షేమము. మా యగ్ని

లును గుశలంబులు. మా జపతపంబులు నిర్విఘ్నంబులు. మా యాశ్రమ మహీరుహంబులు పుష్పఫల సమృద్ధంబులు. మా కెల్ల విధముల లెస్స. ప్రభూత్తమా! సతీ పుత్ర మిత్రామాత్య భృత్య ప్రజాసమేతంబుగాఁ దమకు సుఖంబే గదా" యనెను. "మహర్షి వతంసమా! భవదాశీర్వాచన ప్రభావంబున మా కెల్ల విధంబుల శుభంబై యున్నది. భూభ్రమణ కుతూహలం బున నరుదెంచిన నా పరిభ్రమణంబు భవద్దర్శన భాగ్యంబున సాఫల్య మయ్యె. నేఁగడు బునీతుండనైతిని. మహాత్ముల పాద తలంబులే సమస్త తీర్థంబు లని పెద్దలు వాక్రుత్తురు గాదె; కాన మహాత్మా! భవదీయదర్శనంబున నేను సర్వతీర్థాభిగమ నుండనైతిని నా జన్మంబు సార్థకం బయ్యె"నని పలికి గాధే యుఁడు వచ్చిన పని యైనది గావున మహర్షిని వీడ్కొని నిజపరివారంబును గలియ నెంచి మహర్షిసత్తమా! సైనిక నివహంబులు నాకై వేచియున్నవి. "నే నింకఁబోయి వచ్చెద నన్ననుగ్రహింపు" డని నమస్కరించెను. గాధేయు డిట్టులు వచింప వసిష్ఠుఁడు "రాజేంద్రా! అతిథిసత్తము లగు మీరు మా యాశ్రమంబున కరుదెంచి మా యాతిథ్య మందక వెడలవచ్చునే? మీకును మీచతురంగసేనలకును నాతిథ్య మీయ మనం బుత్సహించుచున్నది, కాన మీ రీ దినం బిచ్చట నాగి మా యాతిథేయ మంది చనుం"డనెను. మహర్షి యిట్లు పలుక ముదితుండై విశ్వామిత్రమహావిభుండు "మహాత్మా! భవద్దర్శనంబుచేతను, భవదీయ మృదుమధుర మనోజ్ఞ ప్రియ భాషణంబుల చేతను మా కీ వఱకే సకలసత్కారంబు లంది

నట్టు లయ్యె. తావక పవిత్రహస్త దత్త సుమధుర ఫలావళు లచే మే మీ వఱకే మీ యాతిథేయు మంది ధన్యుల మైతిమి. కాన మఱల నేల? మానిసత్తమా, పోయివచ్చెద. మా యెడ వాత్సల్యము దొలంగకుండు"డనెను. అనిన వసిష్ఠుఁడు "రాజేంద్రా! అట్లు గాదు. యాతిథ్య మందక వెడలుట మా కానందకరము గాదు. ఈ దినం బిక్కడఁ దప్పక నిలుఁ"డని బహు భంగుల బలవంతపఱిచెను. విశ్వామిత్రున కేమియుఁ దోఁచదయ్యె. తమ చతురంగసేనలా యల్పంబులు గావు. అదియా మునిపల్లె. తన యనంత సేనావాహిని కా వసిష్ఠ మహర్షి యెట్టు లాతిథ్య మీయఁగలఁడు? అటులఁ గాదని బహుభంగుల నిలువ వేఁడెడు నమ్మహాత్ముని కోరిక నిరాకరించి యెవ్విధంబున నేగనగును? కౌశికు డిట్టు లాలోచించుచుండ నాతని యింగితం బెఱింగి యరుంధతీపతిభుండు నృపాలా! మీ చమూసమూహంబులు మాకు భార మని శంకింపకుఁడు. దైవత కామగవియైన మా నందిని యెన్ని వాహినీసముదయంబులకైన నాతిథ్య మీయఁజాలు"ననెను. మహర్షి యైన వసిష్ఠు డిట్లు దృఢంబుగాఁ బల్కి నంతఁ నమ్మహాత్ముని యానతి నిరాకరింపనేరక విశ్వామిత్రుఁ డాతని యాతిథేయ మంద నంగీకరించి నిలిచెను. వసిష్ఠ మహర్షివరు నానతిచే నాతని శిష్యులు రయంబున నేగి విశ్వామిత్రుని పరివారంబు నాహ్వానించి తెచ్చి యాశ్రమంబున విడియింపఁజేసిరి.

అంత వసిష్ఠ మునివరుండు శబల యను తన హోమధేనువును బిలిచి "శబల! చతురంగసేనాసమేతుం డగు విశ్వా

మిత్ర మహీజానికి విందుసేయవలయును. భక్ష్యభోజ్య చోష్య లేహ్య పానీయాది సమస్త భోజ్య పదార్థంబులను సృష్టింపు"మని యానతిచ్చెను. వెంటనే శబల దివ్యములైన శాల్యాన్నపు రాసులను, ఘనంబులైన శాకంబులను రుచ్యంబులైన వ్యంజనంబులను, మధురంబులగు రసాయనంబులను, సారతరంబులైన భక్ష్యంబులను, రుచిరంబులైన దధిక్షీర ఘృతాదులను నధికంబుగా సృష్టించెను. అంత వసిష్ఠమునివరు శిష్యులు రాజునకును, రాజసైన్యంబులకును, నాతని హిత బంధువర్గంబునకును వేర్వేఱ స్వర్ణ రజత భాజనంబు లమర్చి వడ్డింప దొరకొనిరి. ఇట్లు వసిష్ఠమునివరు శిష్యులు పంక్తులెల్ల కలయఁ దిరిగి కొసరి కొసరి వడ్డింపుచుండ విశ్వామిత్ర భూపతియు నాతని పరివారంబును కుత్తుగ బంటిగ విం దారగించిరి. ఇటుల విఁదు ముగియ కర్పూరపు విడియంబు లందికొని విశ్వామిత్రుఁడు మహనీయం బగు నాయాతిథేయమునకు సంతుష్టాంతరంగుఁడై యట్టి యుత్కృష్ట పదార్థంబు లుత్పన్నము గావించిన యా కామగవి మహా ప్రభావంబునకు మది మెచ్చుచు వసిష్ఠమహర్షిఁ గని "మౌనివర్యా! మీ యాతిథేయ మమోఘంబు. మా రాజమందిరంబులనేని నిట్టి భోజ్యంబులు లభించు టరిదియని ఘనంబుగాఁ బ్రశంసించి మఱియు నాతని కిట్టు లనెను. "మౌనిచంద్రమా! చనవున నొక్క వాంఛితం బెఱిఁగించెద, విన వేఁడెద. మీ శబల మహాప్రభావంబు గలది. కాన మహనీయం బగు మీ హోమధేనువును నా కొసంగుడు. దానికి మాఱుగా మీకు లక్షగోధనం బొసం

గెదను.'' విశ్వామిత్రుఁ డిట్లు వచింప చిఱునవ్వు మొగమునకు వింత ప్రకాశమును గూర్ప వసిష్ఠ మహర్షి యా రాజేంద్రునిఁ గని "రాజోత్తమా! మంచి కోరికఁ గోరితివి? తాపసుల మగు మాకు లక్ష గోధనంబును బోషింప సాధ్యమగునే? అది యట్టులుండ ఒక లక్ష గాదు, నూఱులక్షల యావు లైనను మా సౌరభేయితోఁ దుల్యంబులు గావు. మా హవ్యకవ్యంబులు మాయతిథి అభ్యాగతి పూజనంబులును, మా జపహోమాదికంబులును, మా దేహపోషణయు నీ నందిని వలననే నెఱవేఱుచున్నవి.'' కాన దీని నొరుల కీయ వలనుపడ దనెను. అనిన విశ్వామిత్రుఁ డా మునివరు నాలోకించి తాపసోత్తమా! లక్ష ధేనుకంబుల కీయావు నీయ నంగీకరింపవేని స్వర్ణ భూషణాలంకృతంబు లగు పదునాల్గు వేల మదకరీంద్రములను శ్వేతాశ్వంబులు పూన్చిన యెనిమిది నూఱు లరదంబులను, పటువేగాన్వితము లగు నేకాదశ సహస్ర ఘోటకంబులను కోటి మేలియావులను నొసంగెదను. నా కా శబల నిమ్ము. అట్లు గాదేని నా శబలకు ప్రతిఫలంబుగా సువర్ణమణి మయాభరణంబులు గాని నానాదేశ సంభవంబు లైన మేలివస్తు సముదాయంబులు గాని మడి మాన్యంబులు గాని కాంతాజనంబులు గాని వేయేల, నా నిఖిల రాజ్యము గాని యెయ్యది కోరిన నయ్యది కాదనక నొసంగెద. నా కా శబల నిమ్మనెను. అనవుడు వసిష్ఠుఁ డా భూపాలకులోత్తముం గని "ప్రభూత్తమా! తాపసికులకు రత్నాభరణంబులతో నేటి పని? ఏనుఁగులను గుఱ్ఱములను రథంబులను

నేమి చేసికొందుము? మణిమాన్యంబు లెందులకు; స్త్రీ జనంబులతో నేమి ప్రయోజనము? నా కీ శబలయే యనర్ఘరత్నము. మేటి యాభరణములు సర్వధనము, సమస్త ధారుణీ రాజ్యంబైనను నా కీ నందినితోఁ దుల్యంబులు గావు. దర్శపూర్ణమాసాది పర్వంబులను, క్రతు వ్రతంబులను జరుపు సత్క్రియా కలాపమెల్ల మా కీ నందిని వలననే నెఱవేఱ వలయును. కాన, నే మిచ్చినను దీని నిచ్చుటకు వలనుపడ" దనెను. వసిష్ఠుం డిట్లు దృఢంబుగాఁ బల్క రోషకాషాయితాక్షుండై విశ్వామిత్రుఁ డా సంయమిచంద్రునిఁ జురచురఁ జూచుచు "మునీంద్రా! నీ యందలి గౌరవంబుపేర్మి నెన్ని విధంబుల నయంబున నడిగినను గాదు కా దని వాదించుచున్నావు. దేశంబునఁ గల మేలివస్తువు లెల్ల భూపతుల స్వాపతేయములు. కాన, నీ యావును గొనిపోవుటకు భూకాంతులమైన మేము నిన్నింతగాఁ బ్రార్థింపనేల? నే నీ యావు నీ క్షణంబున బట్టిఁ గట్టి తీసికొని వెళ్లినను నన్నంకిలి పెట్టువాఁ డెవ్వఁడు? చూడు"మని పరుషంబుగాఁ బల్కి తన భటులను బిల్చి "ఈ యావును బట్టి కట్టి మన నగరంబునకు గొనిపొం"డని యాజ్ఞాపించెను. వెంటనే ముక్కాకలఁ దేఱిన యుక్కుతునక్కలవంటి రాజభటులు లా శబలనుఁ జుట్టు ముట్టి పాశంబుల బంధించి గొనిపోవ నా శబల తన వాఁడి శృంగంబుల నా రాజభటుల భంగించి బంధంబులఁ ద్రెంచికొని మౌనిసన్నిధికి బాఱి వచ్చెను. ఆ నందిని శృంగంపుఁ బోటులకును, ఖురాఘాతంబులకును మొగంబులు పగిలి మూఁపులు విఱిగి ముక్కానను

నోటను నెత్తురు లురల రాజభటులు దిమ్మిరబోయిరి. ఇంతలో మౌని సన్నిధినిఁ జేరిన శబల యా మౌనిచంద్రునకు నమస్కరించి గోలు గోలున నేడ్చుచు "మహాత్మా! నన్నీ ముష్కర రాజసేవకుల పాలొనర్చి యుపేక్షించితి రేల? నాపై నిట్లు దయ తప్పుటకు నే నేమి యపరాధ మొనర్చితిని? మౌని సత్తమా? మహానీయ ప్రభావుండ వగు నీ సన్నిధిం బాసి నే మనగలనే" యని మొఱపెట్టెను. తోఁబుట్టువు వలెఁ జెంతఁ జేరి నేత్రంబుల బాష్పంబులు రాలఁ బనవిపనవి వాపోయెడి యా గోవును గాంచి బ్రహ్మతనయుఁడు "నందినీ! నే నేమి చేయుదును? ఆ భూపాలుఁడు ప్రభుత్వ గర్వంబునఁ బాడిదప్పి నిన్ను బలిమిం గొనిపోయె. అతఁడు ధారుణీశ్వరుఁడు. నేనో పేద బాపడను. అతఁడు బలోపేతుఁడు; నేనో పీతబలుఁడను. అతనికి రథగజతురగ పదాతి సేనలు గలవు; నాకో నీవు దక్క నన్యంబులు లేవు. అతఁ డనేక దివ్యాస్త్ర కోవిదుఁడు; నేను శుష్కదండ మాత్ర సహాయుఁడను. ఇట్టిఁడనైన నేనా భూపాలుని యాటోపం బెవ్విధి నడఁప గలను? నా స్థితిగతులు నీ వెఱుంగవే" యనెను. అనిన విని, యా కామధేవు "మహాత్మా! బ్రహ్మబలంబు ముందఱ క్షత్రబలం బేపాటిది? ఆ ప్రభు వెంతటి బలోపేతుఁ డైనను బ్రహ్మబల విరాజితు లగు మీ కంటె నధికుం డగునే? మహామహిమోపేతుల రగు మి మ్మాతఁ డెదిరింపఁ జాలునే? కాన, మహాత్మక! భవన్మంత్ర బలాధీన నగు నే నిప్పుడే యా దుశ్చరితుని గావర మడించెదను. నా కనుజ్ఞ దయచేయు"డనెను. శబల యివ్విధంబున

వేడ వల్లె యని మైత్రావరుణి "శబల! శత్రుల పోఁడిమి సెడ వాఁడిమగలఁ బెక్కండ్ర సృజించి యీ రాజసైనికుల నుక్కడంచు" మని యానతిచ్చెను. బ్రహ్మతనయుం డిట్టు లాజ్ఞ సేయ వెంటనే నందిని రిపువారంబుల డెందంబులు కడింది భయంబు పొంద పెక్కువేల శూరానీకంబులఁ దన హుంకారవంబున సృష్టించి విడిచెను. ఇట్లు సృష్టిఁపబడిన తన సేనలఁ జీకాకుఁ బెట్టెడి యీ బప్లవులఁ గాంచి యాగ్రహోదగ్ర చిత్తుఁడై విశ్వామిత్రుఁడు శరశరాసనంబులు ధరించి నిముసంబులో నా బప్లవులనెల్ల రూపడంచెను. బప్లవులిట్లు నశింప నందిని మరల పట్టి సాది యాయుధ ధారు లగు యవనశక సైన్యంబుల సృజించె. విశ్వామిత్ర భూపాలుని ఘోరశరాహతికి వారును నా క్షణంబున మడిసిరి. వసిష్ఠుఁడు శబలను గాంచి "శబల! మంత్రబలం బీతని యెడ వమ్మయ్యెను. కాన,నీమాఱు యోగ బలంబున బలగంబుల సృష్టింపు" మని యాదేశించెను. మైత్రావరుణి యిట్టు లాజ్ఞ సేయ శబల యుత్సాహంబు పొంది వెంటనే హుంకారవంబున గాంభోజులను, బొదుగున బప్లవులను, యోనిని యవనులను, మలప్రదేశమునుండి శకులను, రోమ రంధ్రంబుల నుండి మ్లేచ్ఛ కిరాతాదులను, బ్రభవింపఁ జేసెను. ఇట్లు శబల సకలావయవముల నుండి యుత్పన్నములైన యీ సైన్యంబు లెల్ల నొక్కమొగి విశ్వామిత్రుని చమూహంబులఁ జుట్టు ముట్టి నిరవశేషంబుగా నిర్మూలనం బొనర్చెను. నిజసేనా వాహిని వసిష్ఠ మునీంద్రుని యోగబల ప్రభావంబున్ హతంబగుటకుఁ గినిసి విశ్వామిత్రుని తనయులు

నూర్వురస్త్ర శస్త్రాది సాధనంబుల ధరియించి యొక్కమాఱుగా వసిష్ఠ మహర్షిపైఁ గవిసి వాఁడి తూపుల నా మౌని కుంజరు నొప్పింపఁ గడంగిరి. ఇట్లు నిశిత శరాపాతంబున నొప్పించెడి కౌశిక నందనుల దెస వసిష్ఠుఁడు రూక్ష వీక్షణుఁడై చూచెను. తీక్ష్ణమైన యా మహాత్ముని దృష్టి సోకినంతనే యా విశ్వామిత్రుని తనయు లెల్లరొక్కమారుగా భస్మీభూత గాత్రులైరి. నిజపుత్ర శతకంబు వసిష్ఠ మునీంద్రుని హుఙ్కారంబు మాత్రముననే నీఱగుటయు, నిఖిల సైన్యంబు శబల యంగముల నుండి ప్రభవించిన శూరానీకంబులచే సమయుటయుఁ గని విషాదాశ్చర్యంబు లొక్కపరి మనంబున నుదయింప విశ్వామిత్రమహీపాలుఁడు నిశ్చేష్టుఁ డయ్యెను.

---

## నాలుగవ ప్రకరణము.

అక్కటా! ఇఁక వసిష్ఠ మునీంద్రుని జయించు టెట్లు? చతురంగ సేనలు మడిసె! పుత్రులు నూర్వురు గతించిరి. ఈ విధంబుగా పుత్రులను గోల్పోయి నే నేమని రాజ్యంబునకుఁ బోదును. ఉత్తమ క్షత్రియుఁడ నగు నా కింతకంటె యవమానంబు వేఱున్నదే? యని పుత్ర శోకంబునకుఁ దోడు పరిభవానలంబు గూడ జోడుపడి హృదయంబును జింత దగ్ధంబు గావింప విశ్వామిత్ర మహీపాలుఁడు సిగ్గుఁజెంది శౌర్యంబుడిగి, వెచ్చ నూర్చుచు వడిదగ్గిన కడలి చందంబున ప్రభ సెడి కోఱలు వెఱికిన సర్పంబుభాతి బలముడిగి

రాహు గ్రస్తుఁడైన ప్రభాకరుని పగిది కాంతిబాసి తెక్కలు దెగిన పక్షీంద్రుని వడువున వీతగర్వుఁడై యేమియుఁ దోచక వలపోయుచు పుత్రవియోగ దుఃఖమునకై సైపఁగలను గాని మైత్రావరుణి వలనఁ గల్గిన పరాభవంబు నెట్లు సైరింతును? “దీనికిఁ బ్రతిక్రియ సేయనైతినేని నా క్షత్రియత్వ మేల? నా ప్రభుత్వ మేల? నా యస్త్రపాండితి యేల? నా దోర్బల మేల? కాల్పనా!” యని రోషవివశుం డగుచుఁ బలువిధ ములఁ జింతింపుచుండెను. ఎన్నివిధముల మనస్సమాధానము చేసికొన యత్నించినను వసిష్ఠుని సేఁతకుఁ బ్రతిసేఁత సేయక రాజధానికిఁ బోవుటకు విశ్వామిత్రుని క్షాత్రహృదయం బంగీక రింపలేదు. కాన, వెంటనే విశ్వామిత్రుఁడు హతశేషం బగు పరివారమును నవరోధన జనంబును రాజధాని కంపి భక్త సులభుం డగు నుమాపతిని సేవించి యాతని యనుగ్రహంబున పటిష్ఠము లగు దివ్యాస్త్రంబులఁ బడసి వసిష్ఠుని రూపుమాపెద గాక యని నిశ్చయించి హిమవద్భూధరంబు పొంత కరిగెను. మహనీయ నిష్ఠతో శివుని గూర్చి విశ్వామిత్రుఁడు తపంబు సల్పుచుండెను. ఇట్లు తపంబు సేయం జేయ నొక్క నాఁడు నిటలాక్షుండు ప్రత్యక్షమై “విశ్వామిత్ర భూవరా! నీ తపం బునకు మెచ్చువచ్చె. నీ యభీష్ట వరం బొసంగెద వేఁడు” మనెను. పార్వతీ రమణుం డిట్లు సాదరంబుగాఁ బల్క మోదించి విశ్వామిత్రుఁడు సాంజలియై “భక్తాభీష్ట ప్రదా యకా! పార్వతీనాయకా! కందర్ప దర్ప నివారణ చణా! పన్నగాభరణా! నీవు భక్త సులభుండవు; భక్తాభీష్ట ప్రదుఁ

డవు. నిన్నర్థించి వ్యర్థప్రయోజనుఁ డైన మనుజుఁ డిద్దర లేఁడు. కాన, నా శ్రితులకొంగు పసిండియైన శంకరా! నిన్నొక టర్థించెదను. నాయెడఁ బ్రసన్న హృదయుఁడ వైతివేని సాంగోపాంగముగా ధనుర్వేదం బస్మదీయ వశంబగునట్లును, దేవదానవ యక్ష పన్నగ మర్త్య గంధర్వాదుల యందు గల నిఖిలాస్త్రంబులు నాకుఁ గైవసం బగునట్లును ననుగ్రహింపు" మని వేడెను. విశ్వామిత్రుఁ డిట్లు వేడ భక్తమందారుం డగు భవుండు గాధేయుండు కోరిన వరంబు లెల్ల నొసంగి నిజ నివాసం బగు కైలాసంబున కరిగెను.

నిఖిలాస్త్రంబు లిట్లు శంకరానుగ్రహంబునఁ గైవసం బైన గర్వించి కౌశిక భూవరుం "డహాహా! నేటికి వసిష్ఠునిఁ బరిమార్ప సాధనంబులు బడసితి" నని పూర్ణిమాపర్వ దినంబు నాటి రత్నాకరంబు చందమున నుప్పొంగుచు వసిష్ఠమహాముని యాశ్రమంబు చెంగటి కరుదెంచి తత్క్షణమే భూతనాథ దత్త దివ్యాస్త్ర కీలలచే యా యాశ్రమ మహీజంబుల నెల్ల దగ్ధంబు గావించెను. ఆకస్మికంబుగా నాశ్రమ మహీరుహంబు లవ్విధమున నగ్నిదగ్ధంబు లగుటచే వాని నాశ్రయించి యుం డెడి విహగతండంబులు కర్ణకఠోరంబుగాఁ గూతలు వెట్టుచు మింటికెగసెను. ఆ పాదపచ్ఛాయలఁ బవ్వళించిన సాధు హరి ణంబులు దిక్కులకుఁ బర్వులెత్తెను. ఛాత్రసమేతు లైన మునీ శ్వరులు భయార్తులై పలువంకలకుఁ బాఱిరి. నిస్సహాయులైన స్త్రీ బాల వృద్ధ జనంబులు రోదనంబులు సేయుచు నిలువఁబడిరి. సకల గుల్మ ద్రుమ లతా శోభితంబగు నాశ్రమ వనం బెల్ల క్షణ

ములో భస్మీభూతమై శ్మశానము చందంబున నగుటయు, భయార్తిని మృగపక్షి వితానంబులే గాక మానితండంబులు గూడ బయ్యలెత్తుటయు నసహాయ జనంబు లల్లాడుటయు గాంచి బ్రహ్మతనయుండు "విశ్వామిత్రుని యాగడం బిప్పుడే యుడుపుదు, వెఱచి పాఱకుఁ" డని మునిజనంబుల హెచ్చరించి నిలిపి రోషపరవశుండును, కషాయితనేత్రుండును, కుటిల భ్రూకుటీ నటన స్ఫుట నిటలుండును నై విశ్వామిత్రుని యెట్ట యెదుటికి కరుదెంచి, ఏమి నరేంద్రా! నీ గర్వము! నీ యుద్ధతి నాపలేననియా యిట్టి యాగడంబులు సేయుచున్నాడవు! స్థావరంబు లగు నాశ్రమ మహీజంబులఁ గాల్చినంతనే బలశాలి వైతివే? చెట్టకుఁ జిచ్చు వెట్టుటయుఁ జేడెల సంహరించుటయు గూడ నొక శూరకర్మంబె! ఇదిగో! నా బ్రహ్మదండంబు గనుము. ఈ దండబుననే నీ శంకర దత్తాయుధంబుల నెల్లఁ బరాస్తంబు గావించెద. రమ్ము, అని నిర్ధూమ పావకార్చులఁ బోలు కీలల వెలింగెడి బ్రహ్మ దండంబు కేలగొని వసిష్ఠుఁడు నిలువఁబడెను. అట్లు నిర్భయుఁడై నిల్చిన యరుంధతీనాథుని గని వికవిక నగుచు విశ్వామిత్రుఁడు "వెఱ్ఱి బాపఁడా! ఈ విశ్వామిత్ర భూపాలుఁడు తొల్లిటి విశ్వామిత్ర భూపాలుఁ డనుకొని విసవిస నరుదెంచితివా? భూతనాథ దత్త మహానీయాస్త్రంబుల నేడు నీ తలపుఱ్ఱె నెగురఁగొట్టక విడువను సుమా!" అని యాగ్నేయాస్త్రంబు సంధించి మైత్రావరుణిపై విడిచెను. దోస్తభాగ్రంబున గల బ్రహ్మదండంబున వసిష్ఠుఁ డా బాణాగ్నినిఁ జల్లార్చి క్షత్రబంధు!

మహనీయం బగు బ్రహ్మ బలంబుతో క్షత్రబలం బేమాడ్కి-
డీకొనజాలును. పశు బలంబుతో నాత్మబలమును జయింప
నెంచుట గాదే! రాజా! నీ శక్తి యుక్తుల నడగించి నీ
యస్త్ర పాండిత్యమును వమ్ముఁజేసి నిన్నీ క్షణంబున నె
యమాలయంబున కంపెద. జీవితేచ్ఛ గలవాఁడ వేని నీ
యత్నంబు మాని మాకు శరణంబు జొరు మనెను. వసిష్ఠుం
డిట్లు పలుక రెట్టించిన కట్టలుక విశ్వామిత్రుఁ డా ముని
కుంజరు దెస రూక్షంబుగాఁ జూచుచు "బడుగు తాపసీ!
వీర క్షత్రియుండ నగు నేను బడుగు బాపనికి శరణం బగుదునే
ఎవ రెవరికి శరణం బగుదురో యీ క్షణంబునఁ జూడు" మని
వారుణ రుద్రేంద్ర పాశుపత స్వాపన గాంధర్వ మోహనాది
దురంత సంతాప కారణంబు లగు మార్గణంబులఁ బెక్కింటిని
బ్రహ్మ పుత్రునిపైఁ బ్రయోగించెను. వాని నెల్ల మైత్రా
వరుణి క్షణములో నిర్జించె. మరల కౌశికుండు బ్రహ్మ పాశ,
కాల పాశ, వరుణ పాశాది పాశంబులఁ బ్రయోగించెను.
వసిష్ఠుని యాత్మబల ప్రభావంబున నవియు వ్యర్థంబు లయ్యె.
గాధేయుండు ధర్మచక్ర, కాలచక్ర, విష్ణు చక్రాది చక్రంబుల
వసిష్ఠుని పైఁ బ్రయోగించె. బ్రహ్మ తనయుని
బ్రహ్మ దండంబున నవియుం బరాస్తంబు లయ్యె.
విశ్వామిత్రుఁడు మరల శక్తి యుగళంబు విడిచె. వసిష్ఠునిచే
నవియుఁ జితంబు లయ్యె. అంత నితాంత కోపంబునఁ గాలాం
తకుని వోలె మండిపడుచు విశ్వామిత్రుఁ డొక్కొక్కాస్త్ర
ప్రయోగ మీతని యెడఁ జాలదు. నిఖిలాస్త్రంబుల నొక్క-

మ్మాడి నీతని పైఁ గవియించెద నని తలంచి కాలాస్త్ర, వైద్యాధర, కాపాల, త్రిశూల, కంకణాది జిహ్వాగంబుల నెల్ల నొక్కమాఱుగా వసిష్ఠుని పైఁ బ్రయోగించెను. బ్రహ్మాండ మాత్ర సహాయుఁడైన మైత్రావరుణి వానినిఁ గూడ నిర్జించి దుర్జయుఁడై నిలువఁబడెను. ఘోరంబగు తపంబున సాధితంబులైన మహనీయాస్త్రంబు లెల్ల వసిష్ఠునిచేఁ జితంబులగుటకుఁ గరంబు వందురుచు విశ్వామిత్రుఁ డీదిరమైన యీవిరించి సుతుని సమయింపక పోవునే యని మహోగ్ర కోపంబున బ్రహ్మాస్త్రం బరివోసి వసిష్ఠుని పై విడిచెను. అట్లు విడిచినంతనే యమ్మహాస్త్రంబును భీకరజ్వాలా మాలికలు బ్రహ్మాండంబుల నిండింపుచు మహోగ్ర తేజంబున వచ్చి వసిష్ఠునిఁ బైకొనెను. మహామహిమాఢ్యుం డగు బ్రహ్మతనయుం డా బ్రహ్మాస్త్రంబును నెన్నముద్దకై వడి కబళించివైచెను. లోకభయంకరంబగు నమ్మహాస్త్రంబును గ్రసించుటఁజేసి యరుంధతీ ధవుని యాకృతి కఠంబాలోకన భీకరంబయ్యెను. ఆతని రోమకూపంబుల నుండి యుజ్వల జ్వాలామాలికలు వెలువడి లోకంబులు దాహంబునొందింప నుంకెను. అవ్విధం బరసి బృందారకులును మహర్షులును భయంబు నొంది మహానుభావుండైన వసిష్ఠ మునీంద్రుని చెంత కరుదెంచి యాతని మహామహిమంబును బెక్కుదీతులఁ బ్రశంసించుచు మహాత్మా! నీతపోమహిమంబన దృశంబు. నిస్తుల తపోగరిష్ఠుఁడ వగు నిన్నెదుర్కొని యీ విశ్వామిత్రమహీజాని పరాజయంబు నొందెను. కాన, నీ కర్తవ్యంబు నెఱవేఱె. తపోధనా! ఇఁకనైన జగదుపద్రవ

కరంబగు నీ తేజంబుప సంహరించి లోకంబులఁ గాపాడుమని వేడుకొనిరి. ఇట్లు నిలింపులు ప్రార్థింప లోకరక్షామతియై వసిష్ఠ మహర్షి తేజంబుడిపి శాంతుఁడయ్యెను. అంత నమరులును మహర్షులును వసిష్ఠుని మహిమంబునుఁ గీర్తించుచు నిజనివాసంబుల కరిగిరి.

వసిష్ఠుని మహా ప్రభావముం గాంచి విశ్వామిత్ర భూపాలుఁ డిస్సీ! ఏటి క్షత్రబలము! చతురంగ బలములును, సకలాస్త్రంబులును నొక్క బ్రహ్మదండమే నిర్జించెను. బల మన బ్రహ్మ బలమే బలము; ఋషి యన వసిష్ఠుఁడే ఋషి. ఛీ! క్షత్రధర్మంబు కడు నిస్సారంబు; సకలాస్త్రంబులు నిరుపయోగంబులు. హీనంబు లగు క్షత్రియధర్మంబులఁ బరిత్యజించి శాంతచిత్తుండనై తపంబు సల్పి బ్రహ్మత్వంబు బడసెద. లేదా, ప్రాణంబులఁ బాసెద నని నిశ్చయించి హతశేషుం డగు తనయుని రాజ్యంబునకుఁ బట్టంబు గట్టి భార్యాయుతుఁడై దక్షిణ దిశ కేగి తపంబు సేయఁ గడంగెను. అట హవిష్యంద, మధుష్యంద దృఢనేత్రులను తనయులు కలిగిన యనంతరం బొక్క వేయి వత్సరంబులు నిష్ఠురతపంబు సేయ విశ్వామిత్రునకు విరించి ప్రత్యక్షమై, గాధేయా! నీదగు నుగ్రతపంబుచే రాజర్షి పదమందితి వని వాక్రుచ్చి నిజలోకంబున కరిగెను. అంత విశ్వామిత్రుఁ "డెంతయో యుగ్రతపంబు సేయ పరమేష్ఠియల్పంబగు రాజర్షి పదంబిచ్చి చనియె. దీన నా యభీష్ట మెట్లీడేరు నని చింతించి యింతకంటె గరిష్ఠంబగు తపంబు సల్పెద గాక" యని నిశ్చయించి మరల నుద్దామం బగు తపంబునకుఁ బూనెను.

---

# ఐదవ ప్రకరణము.

మనోజ్ఞ శీతల సుఖదమై మంద మలయానిల మల్లనల్లన వీఁచెడు సమవర్తి దిశను బ్రహ్మ పదాభిలాషి యగు విశ్వామిత్రుఁ డట్లుదగ్ర తపంబు సలుపుచుండ నొక్క నాఁడు “ మహాత్మా! రక్షింపుమా, రక్షింపుము, అనన్య శరణ్యుఁడను; అగతికుఁడను; ఈ దీనునకు నీకంటె త్రాతలు లే” రను దీనాలాపం బొండు వినవచ్చెను. ఉత్తమ క్షత్రియ కులంబునఁ బుట్టిన వాఁడెవ్వఁడు శరణని మొఱలిడెడి యార్తుల దీనాలాపముల వినియు విననట్లు లూరకొనును? ఆ యార్తస్వనము విని నంతనే రాచపట్టి యగు విశ్వామిత్రుని మనంబు చలించెను. నిమీలితములై యున్న నయనంబు లున్మీలితములై యప్రయత్నముగా చిత్తమా యార్తుని దెస కాకర్షింపఁబడెను. వెంటనే విశ్వామిత్రుఁ డా యార్తు నుద్దేశించి “ ఓయీ! శరణాగతుఁడా! ఆర్త రక్షా తత్పరుం డగు నీ విశ్వామిత్ర మునివరుఁడు సూర్య చంద్రులు సాక్షిగా నీ కభయం బొసంగెను. ఎట్టి బెట్టిదం బగు కష్టంబునఁ గాసిల్లుచున్నను నోయి! యార్తుఁడా! నీ విఁక రక్షింపఁబడితి” వని యుచ్చైస్స్వనంబునఁ బల్కెను. కర్ణ రసాయనంబు లగు నప్పలుకు లాలించినంతనే యయ్యార్తుఁడు నిర్భీకుండై రయంబున వచ్చి విశ్వామిత్రుని పాదంబులఁ బడెను. గాధేయుఁ డాతనిఁ గాంచి యాశ్చర్యముతో “ నెవరు నీవు? ఛండాలుఁడవా! నీ కాసన్నమైన యాపద యెద్ది? ” యనెను. “ మహాత్మా! ఈ ఛండాలత్వమే ”

యని యా దీనుఁడు శోక గద్గద స్వనముతోఁ బ్రత్యుత్తర మొసఁగెను. "ఏమి నీ కిది ప్రాప్తించిన మాలత్వమా! అయిన నీ వెవఁడ" వని విశ్వామిత్రుఁడు సాశ్చర్యుఁడై మఱల నాతనినిఁ బ్రశ్నించెను. "అవును మహాత్మా! నా కిది ప్రాప్తించిన మాలత్వమే. ఈ చండాల రూపంబు రాకపూర్వము నే నిక్ష్వాకు కుల సంభూతుఁడను; సత్యవ్రతుఁ డనియుఁ ద్రిశంకుఁ డనియు నుభయాభిధేయంబులఁ బ్రసిద్ధిఁ జెందిన రాజేంద్రుఁ డను. వాసిష్ఠుల శాపోపహతిచే నిట్టి శ్వపచత్వమునకుఁ బాలైతి" ననెను. త్రిశంకుఁ డిట్లు దీనంబుగాఁ బల్కఁ గరుణా కలిత చిత్తుండై విశ్వామిత్రుఁడు "రాజా! భానుకుల దీప కుండ వైన నిన్ను సామాన్యునిగా భావించిన నా నేరమును సైరింపు" మని పల్కి "రాజేంద్రా! ఆ బాపని దౌర్జన్యము నకు నీవును గుఱియైతివా? కారణ మేమి? వారి తండ్రి యైన వసిష్ఠుఁడు మీ కుల గురుఁడు గదా!" అనెను. "అగును మహాత్మా! ఆ గురునివలననే నా కిట్టి పాటులు వచ్చినవి. తాపసోత్తమా! ఆ తండ్రి కొడుకులచే నాఁ బడిన బన్నంబు లే మని వాక్రుత్తును? మెయితో దివి కేగవలయు నని నా కెన్ని దినముల నుండియో యభిలాష. ఆ యభీష్ట మీడేర్చు కొనుటకై యస్మత్కుల గురుం డైన వసిష్ఠమహర్షి కడ కేగి "మహాత్మా! బొందితో స్వర్గమున కుద్గమింప వలయు నని కుతూహలపడుచున్న వాఁడ. అస్మదభీష్ట మీడేర్చుటకై యెట్టి జన్నంబు సేయ నగు నట్టి దానిని నాచేఁ జేయించి నా కీప్సి తార్థసిద్ధి యగునట్టు లనుగ్రహింపు మని వేఁడికొంటిని.

అంతటను గా తాపసో త్తముఁడు 'రాజేంద్రా! క్షత్రియు లిట్టి
సవనంబు సేయరాదు. కాన నీకు నే నధ్వర్యమొనరింపఁ జాల'
నని వాకుచ్చెను. అంత నే నా మహాత్ముని వీడి యా మహర్షి
కుమారులు వసించెడి యెడ కేగి యవ్వాసిష్ఠులకుఁ గూడ నా
కోరిక నెఱింగించి గురునందనులారా; మీ జనకుండు నా
యభీష్టముఁ దీర్ప నిరాకరించెను. మీరైన నికార్యంబున
కొడఁబడి నా వాంఛితం బీడేర్పుఁ డని దోసిలొగ్గి ప్రార్థించి
తిని. మా యినవంశోద్భవులకుఁ బుణ్యలాభంబు లొడఁగూర్ప
పురోధయే గదా గతి! తండ్రి నిరాకరించినను తత్తుల్య
పుత్రకులైన మీరైనను నాకుఁ దోడ్పడుఁ డని వినయంబున
వేఁడికొంటిని. అందులకు గురుతనయు లవ్వను గా దనక నన్నుఁ
గని పక పక నగుచు "రాజా! ఎంత వెంగలివి! వసిష్ఠ మహా
ముని యసదృశ ప్రభావుఁడు. ఆతడు ప్రత్యాదేశము సేసిన
సవనం బాతని గర్భంబునఁ బుట్టిన యర్భకుల మగు మేము
నిర్వహింపగలమే? అది యట్లుండె. రాజేంద్రా! ఆ మహర్షి
సత్తముఁడు మీ యినవంశ సంజాతులకు పురోధయే గాక
యాచార్యుండు గూడ నగును. ఆ మహాత్మునిఁ దోసి వేఱ
నీకుఁ బాడిగాదు. కాన నీ వీ యత్నంబును మాని నగరంబు
నకుఁ జనుము. లే దేని మరల నా మహాత్ముని సన్నిధి కేగి
యాతనినే ప్రార్థింపుము. మహామహిమోపేతుం డగు నా
మౌని కుంజరుఁడు చేయఁబూనెనేని నెట్టి బెట్టిదంపు కార్యంబు
నైనను ప్రశస్తంబుగా నెఱవేర్పఁగల సమర్థుం" డని పలికిరి.
వసిష్ఠనందను లిట్లు వాకుచ్చ హతాశుండనై యేను వాసిష్ఠుల

కిట్టు లంటిని. “ గురుతనయులారా! మీరు చెప్పి నటుల మీ జనకుఁ డఘట ఘటనా సమర్థుఁడే యగును. కాని యొక మాఱు కా దనిన కార్యంబును మఱల నతఁ డేల సేయ నంగీకరించును? మీరును గా దంటిరి. మీ జనకుండును నిరాకరించె. కాన నేను వేఱొక సమర్థుని నాశ్రయించి నా కామితంబుఁ దీర్చికొందు ” నని యంటిని. ఇట్లు పలికి నేను గురుసుతుల వీడి వచ్చుచుండఁ గోపారుణిత నయనులై గురుతనయులు నా దెస తీక్ష్ణంబుగాఁ జూచుచు “ ఏమి, రాజా! నీగర్వము! వేఱొక సమర్థు నాశ్రయించెదవా? మా తండ్రి కంటె సమర్థు లీరేడు జగంబుల నెందైనఁ గలరా? ప్రభుత్వ గర్వంబునఁ బాడిఁ దప్పి కులగురుండైన మా తండ్రిని తిరస్కరించుచుంటివా? గురుని యవమానించిన యో పాపాత్మా! నీ యవమతి ఫలంబుగా నిప్పుడే చండాలుండవు గ ” మ్మని శపించిరి. “ మహాత్మా! ఏ మని వివరింతు నప్పటి నా దుస్థితి! వా రట్లు పరుషంబుగా శపించినంతనే హేయం బగు చండాలత్వము నాకుఁ బ్రాప్తించి నా కట్టిన పట్టుపుట్టంబు లిప్పగిది మసిపాత లయ్యె. పసిమి మిసిమిం జెలువారు నస్మద్దేహం బివ్విధంబునఁ గటిబొగ్గు చందమున నయ్యె. చక్కదనంబున కిక్కలైన మదీయ వినీల మృదుల శిరోజంబు లీరీతి నెఱుపు దేఱిన గఱకు జుంజురు లయ్యె. వెలలేని సువర్ణమణిమయాభరణంబు లివ్విధమున నాయసాభరణంబు లయ్యె. జందెపుఁ బోగు లిమ్మాడ్కి నినుప తంతువు లయ్యె. దుర్వార శాత్రవ శిరఃఖండనా దక్షం బగు ప్రశస్తకృపాణినిఁ బట్టెడి మదీయ దక్షిణ

హస్తం బీరీతిఁ గొంకి కఱ్ఱకు దావల మయ్యె. పసిడి పాదుకలఁ దొడిగిన యస్మచ్చరణంబు లిప్పగిదిఁ జింకిచెప్పుల కాకరంబు లయ్యె. ఇట్టి హేయాకారంబున నున్న నన్నుఁ గని పరిజను లేవపడిరి. రాజలాంఛనావర్జితుండ నగు నన్నుఁ గని చతురంగ సేనలు మన్నన సేయవయ్యె. కాన వా రెల్లర వీడి వాసిష్ఠ శాపోపహతిచే నిట్లు సర్వ శూన్యుండనై పుల్కసాకారంబున నానా కానన దేశంబులఁ గ్రుమ్మరుచున్న వాఁడ. మహాత్మా! ఇఁక నీవే నాకుఁ ద్రాతవు. పాల ముంచినను నీట ముంచినను నీదే భారము. చేతఁ ద్రోసినను, గాలఁ దన్నినను నిఁక నీ చరణ కమలంబులను విడిచి చనను. అని యుత్తెఱంగున నిజ వృత్తాంత మెల్ల సాకల్యముగాఁ దెల్పి యవిరళాశ్రుధారా సంసిక్త కపోలుండగుచు త్రిశంక భూపాలుఁడు మఱి మాటాడఁ జాలక మిన్నకుండెను. చతుస్సముద్ర ముద్రిత ధరాచక్రం బేలు రాజేంద్ర చంద్రుఁ డయ్యు శాత్రవారణ్య దహన కృశానుం డయ్యు నసదృశ శేముషీ విశేషుండయ్యు శాపోపహతిచే నట్లు నిస్సహాయుండై వాపోయెడి భూపాలునిం గని దయాకలితాంతఃకరణుండై విశ్వామిత్రుఁడు త్రిశంకుని మేను నిమురుచు "రాజేంద్రా! దుఃఖింపకుము. ఎవ్విధంబున నైనను నిన్నుఁ బ్రోచెదను. నీ యభీష్ట మీడేర్చెదను. ఆపన్నశరణ్యుండ నగు నాయండఁ జేరియు నీ విఁక దుఃఖింపనేల? లెమ్ము! స్వస్థచిత్తుండవు గమ్ము. భయశోకంబుల వీడు" మని యాశ్వాసించెను. శ్రవణపేయంబు లగు విశ్వామిత్రుని వచనంబులకు త్రిశంకుని మనం బించుక దుఃఖ విముక్త మయ్యెను. అపుడు

విశ్వామిత్రుఁ డారాజేంద్రుని గని "సత్య వ్రత మహీపాలా! ఇపుడు నీ వాంఛితం బెయ్యది? ఈ ఛండాలత్వ ముడుపవలయునా?" అనెను. "కాదు మహాత్మా!" యని త్రిశంకుఁడు ప్రత్యుత్తర మిచ్చెను. "అయిన రాజా! ఇప్పటికిని బొందితో స్వర్గమున కేగుటయే నీ కామి తార్థమా?" యని గాధేయుఁ డడిగెను. "చిత్తము, మహాత్మా! నా యభీష్ట మదియే. తపోధనా! ఈ యీప్సితము నెఱవేర్చుకొనుటకై గురువును గురుపుత్రులను గూడ ప్రార్థించి విఫలమనోరథుఁడ నైతిని. తుట్టతుద కిట్టి చండాలత్వమును గూడఁ బొందితిని. కాని నాకు మెయితో దివి కేగ వలయు ననెడి యాకాంక్ష మాత్రము నశింపలేదు. మహాత్మా! బొందితో స్వర్గమున కుద్గమింప వలయు ననెడి యాకాంక్షతో జిఱుకాలమునుండి నేఁ జేసిన కార్యంబు లిన్ని యన్ని కావు. శతాధ్వరంబులు సల్పి దేవతల మెప్పించితిని. భూరి దక్షిణలతో విప్రులఁ దన్పితిని. నిష్ఠురోపవాసంబులచే శరీరంబును గ్రుక్కిం చితిని. నిఖిల సత్కారంబుల గురువుల నర్చించితిని. నిఖిలో పచారములఁ బెద్దలఁ బూజించితిని. సత్యంబుఁ దప్పక ధర్మంబు మీఱక ప్రజలఁ బాలించితిని. మహామునీ! ఎంత ధర్మ యుతంబుగఁ బ్రవర్తించినను దేవతలకుఁ గాని గురులకుఁ గాని నాపై నెనరులేదయ్యె. నా మనోరథం బీడేర్చుట కేరును గడంగరైరి. కాన మహానుభావా! దైవమే పరము; దైవమే శరణ్యము; సమస్తము దైవాధీన మనెడి నా విశ్వాసము దైవో పహతుండ నగుటచే శిథిలమైనది. కావున మహామహిమో

పేతుండ వగు నీ శరణంబుఁ జొచ్చితి. దైవంబును వారించి పురుషకారంబున నన్నుద్ధరింపు మని సత్యవ్రతుఁడు పల్కెను. సత్యవ్రతుం డిట్లు ప్రార్థింప నివురు గప్పిన నిప్పు చందమున నడఁగియున్న విశ్వామిత్రుని పౌరుషం బొకమా రుజ్జ్వలముగాఁ బ్రజ్వలించెను. అంత నాతఁడు త్రిశంకునిఁ గని రాజా! దుఃఖ నివృత్తుఁడవు గమ్ము. నీ బహుకాల మనోరథం బీడేఱు నట్లు నీచే జన్నంబుఁ జేయించి యీ ఛండాల దేహంబుననే నిన్ను నాకంబునకుఁ బుత్తెంచెద నని వాక్రుచ్చెను. కర్ణపేయంబు లగు నప్పలుకు లాలించినంతనే తన వాంఛితం బప్పుడే హస్తామలక మైనట్లు లానంద కందళిత హృదయారవిందుఁడై త్రిశంక నృపాలుఁడు పునః పునః ప్రణామంబుల విశ్వామిత్రు నర్చించెను.

---

## ఆ ఱ వ ప్ర క ర ణ ము.

రాజర్షి యగు విశ్వామిత్రుని పూన్కి యసదృశమైనది. ఏదేని నొక విషయమై కృతనిశ్చయుఁ డైన పిమ్మట నక్కార్యము నెఱవేఱ్చు వఱ కాతఁడు శాంతుఁడై యుండ జాలఁడు. తలపెట్టిన కార్యము కడముట్టు వఱకు విఘ్నములకు వెఱవఁడు. దుష్కరం బని వెనుదీయఁడు. చేయఁజాల నని నిరాశ నొందఁడు.

శా॥ ఆరంభింపరు నీచ మానవులు వి
ఘ్నాయాస సంత్రస్తులై

యారంభించి పరిత్యజింతు రురు వి
ఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్ననిహన్యమాను లగుచుక్
ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుఖీ
ప్రజ్ఞానిధుల్ గావునన్ ॥

అని భర్తృహరి సుభాషితమునందు వర్ణింపఁబడిన చందమున విఘ్నములకు నిరుత్సాహముఁ జెందక ప్రారబ్ధార్ధముల సాధించెడు ప్రజ్ఞానిధు లగు ధీరులలో గణింపఁదగిన వాడు విశ్వామిత్రమహర్షి. త్రిశంకుని కేక్షణమున నభయ మిచ్చెనో నాక్షణముననే యాతని యాప్సితమును నెఱవేర్చు యత్నములు సేయుటకు గాధేయుఁడు సంకల్పించెను. కార్య దక్షు లగు తన కుమారులను బిలిచి "కుమారులారా ! మీరు యజ్ఞమునకుఁ గావలసిన సమస్త వస్తుచయమును శీఘ్రముగా సమకూర్పు" డని యానతిచ్చెను. తదుపరి శిష్యులను బిలిచి "ఛాత్రులారా ! మీరు నానాదేశంబులఁ గల ఋష్యాశ్రమంబుల కేగి ఋషివరుల నందఱ సశిష్యముగ నాహ్వానించి రండు. ఎవఁడేని నా యామంత్రణం బంగీకరింపక యేమేనిఁ బల్కెనేని సంశయింపక వచ్చి నా కెఱిగింపుఁ డని యాజ్ఞా పించి యంపెను. వెంటనే గాధేయాత్మజులు తండ్రి యానతి ప్రకారము యాగ ద్రవ్యములను సమకూర్పఁ గడంగిరి. శిష్యులు మునివరుల నాహ్వానింప నేగిరి. ఆ సన్నాహంబులను గని బొందితో దివి కేగెడు భాగ్యము నేటి కబ్బనట్లెను గదా

యని సత్యవ్రతుఁడు లోలోన నబ్బుచుండెను. మహోన్నీయం బగు తన సామర్థ్యమును జూపెడి యవకాశము లభించెను గదా యని గాధితనయుఁ డలరుచుండెను.

అంత ఋషివరులఁ బిలువ నేగిన శిష్యు లరుదెంచి విశ్వామిత్రున కిట్లు విన్నవించిరి. "గురువర్యా! దేశదేశం బులఁ గల బ్రహ్మవాదుల నెల్లర నాహ్వానించి వచ్చితిమి. ఛాత్రసమేతులై మౌనివర్యు లనేకు లప్పుడే భవత్క్రతు సందర్శనాకుతూహలాయత్త చిత్తులై యరుదెంచుచున్నవారు కాని శ్రోత్రియుఁ డగు మహోదయుఁడు మాత్రము రా నిరాకరించెను. మఱియు వసిష్ఠ నందనులను మే మామంత్రణంబు సేయ వారు, పక పక నగి "యర రే! యజనకర్త శ్వపచుఁడు. ఆశ్వపచయాగమునకు యాజ్ఞికుఁడో రాచతపసి! ఇట్టి ఛండాల యాగంబునకు శ్రోత్రియులగు బ్రాహ్మణోత్తము లెట్లు రానేర్తురు? మాలని జన్నమునకు మహీసురులతోఁ బని యేమి? అయ్యారే! అట్టి యాగంబున దేవతలు హవిర్భాగంబుల నెట్లు గొందురో! ఆమాలనికి బొందితో బృందారక లోక ప్రాప్తి నెటులఁ గలిగింతురో! ఆహా! ఆస్వర్గ మెట్టి వింత స్వర్గమో; అందలి దేవత లెట్టి వింతవారో! "యని యాక్షేపించిరి. మహాత్మా! శ్రోత్రవ్యములును వక్తవ్యములును గాని యిట్టి నిష్ఠుర వచనంబులు తమ కడ వచించుట యసమంజసమే యైనను భవదాజ్ఞప్తినిఁ జేసి వివరింపక వలను పడదయ్యె." శిష్యు లిట్లు వాసిష్ఠుల • వక్రవాక్యంబులు సవిస్తరంబుగాఁ దెల్ప దండ ప్రహారంబు పొందిన మహోరగంబు కై వడి మండి పడుచు

విశ్వామిత్రుఁడు కన్గవల నిప్పులు రాల "నౌరా! యుపేక్షించిన కొలఁది నీ బాడబుల యాగడంబులు మితి మీఱుచున్నవి. అస్మత్కృతు సందర్శనంబునకు రాకుండిన రాకుందురుగాక, నాచేయఁబూనిన జన్నంబు నాక్షేపింపఁ గతం బేమి? మౌనివరులారా! చూచితిరా, వాసిష్ఠుల దురహంకారము? నిరంతర తపోధ్యానైకరతుండ నైన న న్నకారణంబుగ నెట్లు తూలనాడిరో! ఆ గర్వోన్మత్తుల నిఁక క్షమింపను. ఇప్పుడే తగిన శాస్తి గావించెదఁ గనుఁ డని పరుషంబుగాఁ బల్కి జలంబు లాచమించి "నన్నుఁ దూలనాడిన యావాసిష్ఠు లీ క్షణంబున భస్మీభూత గాత్రులై నిరయంబుఁ జెంది పాపంబులఁ గుడుచుచు, మఱల మఱల ధరఁ బుట్టుచు సప్తశత జన్మంబులెత్తి శునకపలలాహారులై యగతికులై యపూజ్యులై వికారాకారంబున భూమి గ్రుమ్మరుచుందురు గాక. మఱియు న న్నకారణంబుగఁ దిరస్కరించిన యామహోదయ కులపాంసనుఁడు కఱకు టెఱుకయై పుడమి జన్మించి యాత్మహత్యచే మేను వాసి నరకంబు పాలగును గాక." అని ఘోరంబుగా శపించెను. భయంకరం బగు విశ్వామిత్రుని కృత్యంబునకు మహర్షులు కంపించిరి. వియచ్చరులు చకితులైరి. పుడమి గడగడ వడంకెను. గ్రహంబు లదరెను.

---

## ఏడవ ప్రకరణము.

యజ్ఞ సంబారము లెల్ల సమకూడెను. యాగశాలలు సిద్ధము లయ్యెను. నానా దేశాగతులగు లగు బ్రహ్మవాదులతో విశ్వామిత్రు నాశ్రమంబు కలకల లాడుచుండెను అంత గాధేయుఁడు క్రతు వుపక్రమింపఁ గోరి ఋషివరులను గని యిట్లు లనెను. తాపసోత్తములారా! ఇక్ష్వాకు కులదీపకుండగు నీ త్రిశంకు మహారాజు మహాత్యాగి. ధర్మాత్ముఁడు. నిర్మలాంతఃకరణుఁడు, బహుయజ్ఞ కర్త, ప్రజలఁ గన్న బిడ్డలబలెఁ బోషించిన ప్రభూత్తముఁడు. ఈ మహనీయుఁడు మెయితో స్వర్గ గమనంబుసేయఁ గోరి మనలను శరణుఁ జొచ్చి యున్నాడు. కాన మన మందఱ మీ మహారాజునకుఁ దోడ్పడడి సఫలీకృత మనోరథుఁగాఁ జేయుదము. నేను యాజకుఁడనై యజ్ఞంబు నిర్వర్తించెదను. తక్కుంగల కర్తృత్వంబు లీరు వహించి యస్మదుద్యోగమునకు సహాయులరు గండు." విశ్వామిత్రుఁ డిట్లు వాక్రువ్వ మొుఱకున కెఱుక గలదే; కాదనిన నేరిని బూడిద సేయునో యని యాతని యెడం గల భయంబునఁ జేసి తాపసు లాతఁడు పంచిన కృత్యంబులు సేయుట కంగీకరించిరి.

అంత మహనీయ ప్రభావుం డగు విశ్వామిత్రుఁడు ఋత్విజుండై త్రిశంకునకు యజ్ఞదీక్ష నొసంగి క్రతువు జరుపనారంభించెను. విశ్వామిత్రుఁడు కోరిన చందమున మునులు యజ్ఞ నిర్వహణమునకుఁ దోడ్పడిరి. క్రతుభాగంబులఁ గొన

విశ్వామిత్రుఁడు సురల నాహ్వానించెను. ఇటుల సమంత్రకముగా నిలింపుల నాహ్వానింప "ఛండాల యాగంబునకు భోక్తలము గాఁజాల మని యమరులు విశ్వామిత్రుని యాహ్వానంబును నిరాకరించిరి. దివిజు లట్లు హావిర్భాగంబులఁ గొన నిరాకరింప రోషోజ్జ్వలిత నేత్రుఁడై కౌశికమునీంద్రుఁడు సువ్రవంబు చేఁబూని త్రిశంకునిఁ గాంచి "రాజేంద్రా! యుష్మత్కృతు భాగంబులఁ గొన క్రతు భుజులు నిరాకరించిరి గాన, నా యభీష్ట మిాడేఱు టెటు లని దుఃఖాకులుఁడవు గాకుము. అస్మద్ఘన తపో సమార్జిత మహాచ్ఛక్తిచే నిన్నిప్పుడే మేయితో దివి కంపెదను. వాసిష్ఠులకు శాపం బొసంగుటచే నస్మత్త పోఫలం బొకింత క్షయించినను శేషించిన ఫలము నీకు ధారవోసితిని. కాన సత్యవ్రతా! సశరీరుండవై యనన్య దుర్లభంబగు నాకంబునకుఁ జని యక్షయ సుఖంబు లనుభవింపు" మనెను. విశ్వామిత్రుఁ డిట్లు దృఢ వచస్కుండై పలికినంతనే మును లెల్ల రాలోకించుచుండ నక్కజంబుగాఁ దిశంకుఁడు మేయితో దివి కుద్గమించెను. విశ్వామిత్రుని తపచ్ఛక్తి ప్రభావంబున నాకంబునకుఁ జేర వచ్చుచున్న సత్యవ్రతునిఁ గని యమరేంద్రుఁడు "ఛీ! గురుధిక్కారంబు గావించి బాలిశా! గురుపుత్రి శాపోపహతుండ వైన ఛండాలా! పో, పొమ్ము! అక్షీణ పుణ్యోపేతు లగు మహాత్ములు వసించెడి స్వర్గలోకంబున నీ వంటి నీచునకు స్థానము లేదు. పో. పొమ్ము, తలక్రిందుగా ధరఁ గూలు మని త్రోసివైచెను. దేవేంద్రుఁ డట్లు నిష్కరుణంబుగా గెంటివేయ "ఓ మహా ప్రభూ సం

పన్నా! ఇంద్రి తిరస్కృతుండనై పుడమిం గూలుచుంటిని. నన్ను రక్షింపవే'' యని త్రిశంకుఁడు విశ్వామిత్రు నుద్దేశించి యాక్రోశించెను. అయ్యార్త స్వన మాలకించి నంతనే క్రోధ తామ్రాక్షుఁడై గాధేయుఁడు నిలింపులపైఁ గోపించుచు ''రాజేంద్రా! నిలువుము. నిలువుము. ధరణిఁ ద్రెళ్లకు మని యాతనిని మధ్యమార్గంబున నిల్పి నిజ తపో ప్రభావంబునఁ బ్రతి స్వర్గము నిర్మింప నెంచి నక్షత్ర పథమునకు దక్షిణ దిశగా సప్తర్షులను నుడు గణంబులను సృష్టించి, విబుధేంద్రా దులను గూడ సృజింప నెంచుచుండ విశ్వామిత్రుని సాహ సంబును గని యమరులు భయముఁజెంది ఋషి ప్రకరమును ము న్నిడుకొని విశ్వామిత్రుని సవిధంబున కరుదెంచి ''యో మహానుభావా! ఈ త్రిశంకుఁడు గురుధిక్కారంబు చేసిన పాపి. ఇట్టి యకార్య కరణుఁడు మెయితో దివిఁ జేర నెట్టు లర్హుం డగును? ఆ హేతువుచే నీతని ద్రోసి పుచ్చితిమి. కాని నీ మహనీయ ప్రభావము నల్పంబుసేయ నెంచి కాదు. మహాత్మా! ఈ శాపోపహతుఁడు స్వర్గార్హుఁడు గాఁడు. ఇట్టి వానికై ప్రతిస్వర్గంబు నిర్మించి మ మ్మవమానింపకు మని వేఁడికొనిరి. నిలింపు లిట్లు వినయంబునఁ బ్రార్థింప నించుక యోజించి విశ్వామిత్రుఁడు ''సురలారా! మెయితో దివి కంపెద నని యీ రాజేంద్రున కభయ మిచ్చితిని. అట్టి నా వచనంబుల నిప్పు డెవ్వాడుపున మృష గావింతును? కాన నాచే సృష్టింపఁబడిన యీ తారకాసముదయంబును, సప్త ర్షులును, నా లోకాంతము వఱకు నిలిచి యుండునట్లును, నా

సాహాయ్యంబు వేఁడిన యీ సత్యవ్రత నృపాలుఁడు నాకం బునఁ బోలె నిం దక్షయ సుఖంబు లనుభవించు నట్లును నంగీకరింపుడు. అట్లులైన నా సంకల్పించిన బృందారక సృజనంబు మానుదు” ననెను. దేవతలు విశ్వామిత్రుని నిర్ణయంబున కొడఁబడి “తాపసోత్తమా! నీ కోరిన చందమున నీ నక్షత్ర సమితి వైశ్వానరపథంబునకు వెలిగా స్థిరంబులై యుండి యధశ్శిరస్కుఁడౌ నీ త్రిశంకునిఁ జుట్టి యుండును. ఉరుకీర్తి శాలి యగు నీ సత్యవ్రత మహారాజీ నక్షత్ర లోకంబున ననంత సౌఖ్యంబు లనుభవించు”ననిరి. అనిమిషుల యేర్పాటు నకు విశ్వామిత్రుఁ డంగీకరించెను.

ఈ విధంబుగా త్రిశంకుని జన్నంబు ముగియ, దివిజులు దిగులు దీఱి దివంబున కరిగిరి. సవన సందర్శనాహూయమానులై యరుదెంచిన మునీంద్రులును తమ తమ యాశ్రమంబుల కరిగిరి. అంత విశ్వామిత్రుఁ డేకాంతమునఁ దన యహంకారంబు పేర్మి తనకైన తపో విఘ్నంబునకుఁ గరంబు చింతించి తన తోడి మునులం గని “తాపసులారా! ఈ ప్రదేశం బునఁ దపంబునకు బహు విఘ్నంబు లాపాదిల్లు చున్నవి. ఇఁక నిం దుండ నర్హంబు గాదు. కాన రమణీయంబైన వరుణ దిశ రమ్యవన శోభితం బనియు, విమల జలపరిపూర్ణ కాసారికా విరాజితం బనియు వినంబడు గాన తత్తటంబున కరిగి తపంబు సల్ప కొందము వచ్చెదరే” యనెను. వల్లె యని తాపసు లాతని వెంట పశ్చిమదిశ కరుగ నాయత్తులైరి. తత్క్షణమే విశ్వా

మిత్రుఁడు తాపసయుతుఁడై ప్రతీచ్యదిశ కేగి ఫలంబు లాహారంబుగాఁ గొని తపంబుసేయ నుపక్రమించెను.

ఇట్లగ్ని తేజుఁడైన విశ్వామిత్ర మునివరుఁడు పరమ నిష్ఠం దపంబుఁ సేయుచుండ మరల నొక్క వేయి హాయనంబులు పరిపూర్ణమయ్యె. అంత దేవ జ్యేష్ఠుం డైన పరమేష్ఠి యరుదెంచి "గాధేయా! నీ యురుతర తపంబువలన రాజర్షి పద మతిక్రమించి ఋషిత్వ మందితి" వని వాక్రుచ్చి చనెను. కమలాస నుం డిట్లు వచించి చన సంతుష్టుండు గాక విశ్వామిత్రుఁడు ఛీ! యల్పం బగు "ఋషి" పదము నా కేల? నా వాంఛి తార్థం బగు బ్రహ్మత్వంబుఁ బడయు దనుక తపం బుడుగ నని మరల నేకాగ్రచిత్తంబునఁ దపంబు సేయఁ గడంగెను.

---

## ఎనిమిదవ ప్రకరణము

---

ప్రచండ మార్తాండుండు నభోమండల మధ్యగతుండై వాఁడి యైన వేఁడి కిరణంబులఁ బఱపుచు నిఖిల ప్రాణి చయంబును సుడివడ జేయుచుండెను. అత్తఱి నత్తరణితాపంబున కోపక మృగపక్షి వితానంబు లాహారేచ్ఛను మాని వృక్షచ్ఛాయల విశ్రమించి యలసటఁ బాపుకొనుచుండెను. అట్టియెడ వరుణ దిశాభాగంబునఁ గల రమణీయ సరస్తీరంబున నున్న విశ్వామిత్ర మహేంద్రుఁ డొక్కరుఁడు మాత్రమే యాసహస్ర కరుని నిశిత కిరణ తీక్ష్ణతను లెక్కసేయక నిశ్చల

ధ్యానైక రతాత్ముఁడై తపస్సమాధి నుండెను. ఏకాగ్రచిత్తుం డగు నా మానితల్లజున కా చండ మయూఖుని వాఁడి కిరణ జాలములు శశి కిరణంబుల చాడ్పున నై తాప కారణంబులు గావయ్యె. అట్టి సమయంబున "మహాత్మా! విశ్వామిత్ర మానీంద్రా! "కావుము, కావు' మను శోక గద్గదికం బగు బాలకంఠం స్వరం బొండు విశ్వామిత్ర మునివరు వీనుల సోకెను. క్షత్రియ హృదయము శత్రుల యెడ నెంత కర్క శమో శరణాగతుల యెడ నంత మృదులము గదా! "కావుము కావు" మనెడి యాదీనా లాప మెప్పుడు చెవి సోకెనో యప్పుడే తపోధ్యానైక నిమగ్నుఁడై యున్న కౌశికుని మానస మా యార్త స్వనము వంక కాకర్షింపఁ బడెను. ఉత్తమ క్షత్రియాలంకారమైన దీన జనావన తత్పరత విశ్వామిత్రుని హృదయమున మరల తన ప్రభావమును జూపెను. ఎంతటి ఘన తర తపంబు సల్పుచున్నను, జాతినైజ మాతఁ డతిక్ర మింపఁజాలక పోయెను. కాని త్రిశంక రక్షా తత్పరతను మునొ్నక పరి తన తపో ఫలం బెల్ల వమ్మైపోవుట యాతని యుల్లంబున నొక మాఱు మెఱపు మెఱసినట్లు మెఱసెను. విశ్వామిత్రుఁ డు వెనుకాడిన చిత్తముతో నాలోచనా నిమగ్నుఁడై యుండె. అత్తఱి మరల "మహాత్మా! రక్షింపుము. రక్షింపు" మను కాతర స్వరము మరల శ్రుతి గోచరమయ్యెను. విశ్వామి త్రుని క్షాంతి సన్నగిలినది. "ఇసీ! ఏమి తపము! ఆపన్నులఁ బ్రోచుట కంటె తపంబు ఘనంబే! స్వార్థమునకై బ్రహ్మ త్వంబు బడయుట కంటె పరార్థమునకై ప్రాణము ద్యజించుట

మేలు. నా తపోఫలం బెల్ల వ్యర్థమై పోయిన పోవుగాక ఆర్తుడై శరణు వేడెడి యీపన్నునిం బ్రోవంజాలని నా జన్మవలన ఫల మేమి? పాప మీయాపన్నుడెవండో, యెట్టి దుర్భరక్లేశము పాలై మొఱలిడుచున్న వాడో" యని కరుణా కలిత హృదయుడై విశ్వామిత్రుడు తపంబు సాలించి దిగ్గున లేచి యార్తస్వనము వినవచ్చిన దెస దృష్టి సారించి చూడ! నొక్క ముని బాలకుండు పరుగు పరుగున వచ్చి విశ్వామిత్రుని పాదంబులం బడి "మహాత్మా! ఆసన్న మృతుండనై యున్న నన్నుం గావవే"యని రోదనంబు సేసెను. అట్లు వాపో వెడి యా బాలకుని సదయాంతరంగుండై గ్రుచ్చి యెత్తి విశ్వామిత్రుండు "కుమారా! భయము లేదు, ఏమైన సరియే, నిన్ను రక్షించెదను. కాన దుఃఖంబు మాని నీకుం బ్రాపించిన యాప దెద్దియో? నీ తలి దండ్రు లెవరో నిర్భయుండవై తెలుపు" మనెను. సుధా మధుర తుల్యంబు లగు సద్వాక్యంబు లాలకించి నివర్తిత భయ శోకుండై యబ్బాలుండు తన వృత్తాంతముం గౌశిక మునికుంజరున కిట్లు విన్నవించెను, "మహానియా! ఏను భార్గవ వంశ సంజాతుండైన యజీగర్తుడను మహర్షి సత్తముని మధ్యమ తనయుండను, శునశ్శేఫుండను వాండను, అయోధ్యా నగరాధీశ్వరుండైన హరిశ్చంద్ర మహీపాలున కస్మజ్జనకుండు నన్ను యజ్ఞ పశువుగా విక్రయించెను. అదిగో! ఆ వృక్ష చ్ఛాయలం బరికింపుము. మహారాజు నరదం బగుపడు చున్నది. అచ్చట మహారాజు పథశ్రమంబు

వాపికొనుటకై విశ్రమించి యున్నవాఁడు. నిద్రితుఁడై యున్న యమ్మహీజానిని వంచించి దీన శరణ్యుఁడ వగు నీవీ యెడ నున్న వాఁడ వని తెలిసి పాఱివచ్చితిని. మహాత్మా! అదిగో సార్వభౌము నరదంబునకుఁ బూన్చెడి శ్వేతాశ్వముల మెడకుఁ గట్టినఁ జిఱుగంటల చప్పు డెట్లు వినఁబడుచున్నదో! అకటా! అప్పుడే సార్వభౌముఁడు నిజనగర గమనోన్ముఖుండయ్యెఁ గాఁబోలును! అయ్యో! నన్నుఁ గొనిపోవుటకై కాఁబోలు రాజభటు లటునిటు వెదకుచున్నవారు. అకటకటా! యూప బద్ధునిఁ జేసి వపకై ఋత్విజులు వపువుఁ జీల్చుచుండ నెట్లు భరింతును? మహాత్మా! నన్నెవ్విధి నైన రక్షింపఁబూను మని మరల శోకించెను. ఆకంపిత గాత్రుఁడై జాలిఁగదుర నేడ్చెడి యా ముని బాలకునిఁ గని దయార్ద్రచిత్తుఁడై గాధేయుఁ డా బాలుని మఱింత దగ్గఱకుఁ దీసి భయంబు వాయ మేను నిమురుచు "వత్సా! భయము లేదు, ఆతప మింకను తీక్ష్ణముగనే యున్నది. భూపాలుఁ డిప్పుడే రాజధానికిఁ బయనంబు సేయఁడు. ఆ ఘంటా నినాదము శ్రమఁ జెందిన రథాశ్వములు పుడమిం దొరలుచుండ నయ్యెడి నినదంబుగాని యన్యంబు గాదు. రాజ భటులు నీకై వెదకుట లేదు. ప్రాణ భీతుండ వగుట నూరక నడలుచుంటివి గాని కుమారా! నాశరణంబుఁ జొచ్చిన వెనుక నీకుఁ బ్రాణ భయ మున్నదే! లేదు, ముమ్మాటికిని లేదు. కాని "కుమారా! వీరా తండ్రి దయా విరహితుండై యజ్ఞ పశువుగా ని న్నెట్లు విక్రయించె? తండ్రి యొకవేళ నొడబడెఁబో దయా పూరితమతి యగు నీ మాతృహృదయం బెట్లంగీ- నీ నిష్క్

కృత్యంబున కొప్పె"నని ప్రేమ పురస్సరంబుగాఁ బ్రశ్నించెను. కౌశికుఁ డిట్లు ప్రీతిపూర్వకంబుగా బ్రశ్నింప విగతశోకుండై యా బాలుఁడు గాధేయునిఁ గని "మహాత్మా! మా తల్లికి మేము మువ్వురము తనయులము. మా యగ్రజుం డగు శునః పుచ్ఛుండును, మా యనుజుండగు శునకుడును నేనును నేఁటి ప్రాతఃకాలంబున మా యుటజ ప్రాంగణమున నాడుకొను చుండ క్రీత పుత్రికునికై నానా దేశంబులు గ్రుమ్మరుచున్న యీ హరిశ్చంద్ర సార్వభౌముఁడు మమ్ముఁ గని రథంబు డిగ్గి మా యాశ్రమాభ్యంతరంబు చొచ్చి యట నాసీనుఁడై యున్న మా జనకునిఁ గని యాతనిచే సత్కృతుండై యనంతర మిట్టు లనెను. తాపసోత్తమా! మీరు బహుపుత్రికులుగఁ గాన్పించెడిని. కాన నా యందుఁ గృపఁజేసి యొక్క కొమారుని నాకు విక్రయింపుడు. బాలునకు మూల్యంబుగా మీకు నూఱ్వేల యావుల నొసంగెదను" అనిన విని మా జనకుఁడు "రాజేంద్రా! నా జ్యేష్ఠ తనయుఁడైన శునః పుచ్ఛుని నూఱ్వేలుగాదు, కోటివే లొసంగినను నీయఁ జాల"ననెను. అవ్వాక్యంబు లాలకించి మా యమ్మ సార్వభౌము దెస నుపలక్షించి "రాజోత్తమా! వింటివిగదా భార్గవుని పలుకులు! కోటి వేలొసంగినను దన యగ్రసుతు నీయడఁట! జ్యేష్ఠుఁడు జనకున కెట్లు ప్రేమ భాజనుండగు కనిష్ఠుండట్లు జననికిఁ బ్రేమ పాత్రుండగుట లోక సామాన్యమేగదా! కాన నా కడగొట్టు కొమారుఁడగు శునకు నే మిచ్చినను నిచ్చుదానఁగా" ననెను. అప్పగిదిఁ బల్కెడు జననీ జనకులఁ గాంచి రోషించి

యే నా సార్వభౌమున కిట్టు లంటిని. "రాజన్య చంద్రమా! తండ్రి యగ్రతనయు నీయ నని నొక్కి వక్కాణించుచున్న వాఁడు. తల్లి కనిష్ఠ సుతు నీయనని యక్కునఁ జేర్చుకొను చున్నది. వీ రిరువురి యింగితంబుల నారయ మధ్య ముండ నైన నను విక్రయింపఁ దలఁపు గల యట్టుల దోఁచుచున్నది. కాన మా జనకునకు నీ చెప్పినయట్లు లక్ష మొదవు లొసంగి ననుఁ గొనిపొమ్ము" నే నిట్లు పలుక నస్మజ్జనని జనకులు కిమ్మనరైరి. తత్క్షణమే సార్వభౌముడు లక్ష ధేనుకంబులను మా తండ్రి కొసఁగి నన్నుఁ గొనివచ్చెను. మహానీయా! తలి దండ్రుల నిరాదరణకు సహింప నోప కా పగిది బీరంబులుఁ వల్కి రాజేంద్రుని వెంట నరుదెంచినను విశసనకాలమునందలి ప్రాణ పీడఁ దలంచిన నా మనం బిప్పుడే తపించుచున్నది. ఓ దయామయా! నీ వసదృశ తపశ్శీలుడవు. స్రష్ట సృష్టికిఁ బ్రతి సృష్టిఁ జేసిన మహానీయ ప్రభావుండవు; ఇట్టి ప్రజ్ఞా ధురీ ణుండ వగు నీకు నావంటి బాలకునిఁ గాపాడు టే పాటి గరిష్ఠ కార్యంబు! కావున నో మహాత్మా! నన్ను విల్చిన యీ మహా రాజున కధ్వర భంగంబును, నాకుఁ బ్రాణ భంగంబును గాని భంగిని నన్నుఁ గావు"మని హృదయ భేదకముగా వాపోవ దొడం గెను. సమంజసములైన యా మునికుమారుని వచనంబులకుఁ బ్రీత చేతస్కుఁడై గాధేయుఁ డా విప్రతనయు నెవ్విధంబున నైన గాపాడఁ గృతనిశ్చయుఁడయ్యెను. ఆర్తరక్షా తత్పరతం దగిలిన యా గాధేయుని మానసమునకు నిజతపో విచ్ఛిత్తియే తోఁచదయ్యె. అంత నాతఁడు మునికుమారు నేఁడువవలదు.

సార్వభౌము వలన భయంబు లే దని యూరడించి నిజ నంద నులఁ బిలిచి యిట్లు లనెను. "కుమారులారా! ఈ ముని కుమారుఁడు ప్రాణ భీతుఁడై నను శరణంబు వేఁడినాఁడు. విప్రకులంబున నేని, క్షత్రియ కులంబున నేని యాశ్రిత రక్షణముతోఁ దుల్యంబగు ధర్మం బన్యంబు లేదు. అందును శరణాగత రక్షణము విక్రమ తేజులగు రాచవారి కమూల్యా లంకారము. కాన క్షత్రియులమైన మన మీ విప్రకుమారునిఁ గాపాడవలెను. పుత్రకులారా! తలిదండ్రులు తనయుల వాంఛించుట తాము నిర్దేశించిన కార్యంబును కాదనక యాచరించి సుకృతవంతులనుగాఁ జేయుటకే గదా! కాన ప్రియ తనయులారా! మీ కొక్క ధర్మం బుపదేశించెద వినుడు. ఈ ముని తనయుఁడు తండ్రి తన్ను యాగ పశువుగా విక్రయింప మృత్యుభయంబున నాపన్నుఁడై మనల శరణుఁ జొచ్చినాఁడు. అగతికుఁడై ప్రాణభయంబున నల్లాడెడి యీ బాలుని ప్రార్థనంబును నిరాకరింపఁ జాలక దయార్ద్రచిత్తుండనై యీతనిఁ బ్రోచుట కభయం బొసంగితిని. కాన ప్రియ తనయులారా! మీలో నొక్క రీ బాలునకు మాఱుగా యాగపశుత్వ మంగీకరించి యీతనికిఁ బ్రాణదానము సేయుడు. సుతులారా! మీరు సమస్త శాస్త్రంబులను జదివినవారు. సమస్త ధర్మంబులను గ్రహించినవారు. కాన మీ రెఱుఁగని పరమ ధర్మ మెందు గలదు? ఈ యల్ప కార్యముః నెఱవేర్చుటకే నింతగాఁ బనిపూని చెప్పవలయునా? తనయులారా! లెండు! ఈ మహత్తర కార్యమునకు నేను నే నని ముందునకు వచ్చి కౌశిక నందనులు

తండ్రికిం దగిన తనయు లని స్థిరయశము గాంచుము. ప్రియ
పుత్రులారా! ఊర్జిత ధర్మ నిష్ఠులైన మీ రీ కర్జంబును దీర్చితి
రేని ప్రాణ భయంబున నల్లాడెడి యీ ఋషికుమారుండు
బ్రదుకును. సార్వభౌముని జన్మంబును నెఱవేఱును; వేల్పులు
హర్షింతురు. జగజ్జనులును మీ యద్భుత త్యాగమును వేనోళ్లం
గీర్తింతురు. అనన్య దుర్లభంబగు సుకృతియు మీకుం గల్గును.
నా మాటయు నిలుచును." సధర్మ్యంబును, సకరుణంబును,
సంస్తవనీయంబును నగు వచనంబుల జనకుం డిట్లు హెచ్చ
రింప పకపక నగుచుం గౌశికాత్మజులు "తండ్రీ! ఏమి నీ ధర్మో
క్తులు! ఎంతటి దీనరక్షణాసక్త చిత్తుండవైన నగుంగాక, య
న్యుల తనయులకై నిజ తనయుల బలి వెట్టు తండ్రి యెందైనం
గలండే? నిజ పుత్రునిపైం గల కూర్మిచేం గాదే యీ హరి
శ్చంద్ర మహీజాని యాత్మసుతు నెందో దాంచి క్రీత పుత్రు
కునిచే జన్మంబుసేయ యత్నించుచున్నవాండు. లోకంబునం
దండ్రి తనయుల వాత్సల్య ధర్మ మిట్లుండ నహేతుకంబుగం
ద్రోవ వోవు వానికై మమ్మసురు లర్పింపు డనుట న్యాయమే,
లోక ధర్మమే? జగంబునం దీపగు వస్తువులలో నెల్ల
నసువులపైం దీపి యధిక తమం బగుట యెఱుంగవే? అట్టిచో
జనకా! ఎవని కొఱకో మా ప్రాణముల నీయు మనిన మే మెట్లు
లొప్పుకొందుము. కాన నీ యభీష్ట మీడేర్పం జాలము.
బాలునిపై నీ కెనలేని నెనరుం గల దేని వేఱొక తెఱంగున
రక్షింపుము." కుమారు లెల్లరైకకంఠ్యముగ నిట్టు లాక్షే
పించి తన యానతిం ద్రోసివేయ విశ్వామిత్ర మునివరుండు

క్రోధ తామ్రాక్షుండై కుమారుల దెస చుఱచుఱఁ జూచుచు "దురాత్ములారా! ఏమి మీ పొగరు బోతుఁ దనము! అప్రతిమాన ప్రభావుండ నగు నాయానతి నతిక్రమించియు నిర్భీకంబుగ ధర మనఁ గల మను కొంటిరే? ఈ విశ్వామిత్రుఁడు పుత్రుల యెడను శత్రుల యెడను సమభావుండు. తన యాజ్ఞాతిక్రమణంబు సేసిన యవిధేయు లాత్మజులైన నగుదురుగాక యంతకంటె నధికులైన నగుదురు గాక అతఁడు సైరింపఁడు. కావున నో దుశ్చరితులారా! నాయానతి నుల్లంఘించి నన్నధిక్షేపించిన మీ రవ్వాసిష్ఠుల వలెనే శునకామిషంబున క్షుధానివృత్తిఁ జేసికొనుచు సప్తశత జన్మంబు లెత్తి పరమ నీచభావంబునఁ బల్లటిలుఁడు"ని శపించెను. విశ్వామిత్రుని నిష్ఠురకృత్యంబునకు జగంబులు చలించెను.

కుమారుల నిట్లు క్రూరంబుగా శపించి తత్క్షణమే శునశ్శేఫుని వెంట నిడుకొని హరిశ్చంద్ర మహీజాని విడిసిన తరుచ్ఛాయ కడకేగి విశ్వామిత్రుఁ డాతనిచే యథార్హ సత్కారుండై యాతని కిట్లు లనియె. "రాజేంద్ర! యుష్మద్వంశము దయా సత్య శౌచములకు వాసిఁ గనినది. దీనులఁ బ్రోవని వాఁడును, శరణాగతులఁ గావని వాఁడును, ఆపన్నుల యెడ దయఁజూపని వాఁడును, మీ వంశమున నింతవఱ కుదయింప లేదు. ఇట్టి యుత్తమాన్వయ సంజాతుండ వైన నీకు నేను ధర్మములు గఱప వలయునా? అయినను నొక్క మాట, సార్వభౌమా? సకలాపదల నుండి ప్రజలను రక్షించుట రాచకొలమున జన్మించిన యెల్లవారికిని ధర్మము. అందును ప్రభువైన

వానికీ కార్యము ముఖ్యకర్తవ్య మనుట రాచపాడి నెఱిగి జనరంజకముగా ధరా పాలనంబు సేయుచున్న రారాజ వగు నీకు నేను వేఱుగఁ జెప్పఁ బని యేమి? గుణములలో నెల్ల దయా గుణం బుత్తమోత్తమంబు. మనుజుఁ డెంతటి శమ దమాది సద్గుణ సంపన్నుఁడైనను, నెంతటి ధర్మ పరుఁడైనను, నెంతటి దైవభక్తి యుక్తుఁడైనను దయావంతుఁడు గాఁడేని నాతని సుగుణంబులెల్ల బూదిఁబోసిన పన్నీటి చందమున వ్యర్థములు. రాజేంద్రా! ఈ మునికుమారుఁడు జిజీవిషుఁడై మృత్యుభయంబున నల్లాడుచున్నవాఁడు. ఇట్టి భీతుని యాగ పశువుగాఁ జేసి సవనంబు సేసిన ఫలంబు గలదే? దేవతలు మెత్తురే? నీ కామ్యంబులు దీర్తురే? దేవతానుగ్రహంబు వడయ గోరుదేని వేఱొక యాగంబు సేయరాదా? పట్టినఁ బాలుగాఱు నునుఁ జెక్కుల నొప్పారు నీ ముద్దు బాలునే విశ సించి యాగంబు సేయవలయునే? రాజా! ఇట్టి యకార్య కర ణంబు సేయ నీ మనం బెట్లొప్పె? నీ కౌమారుని నెందో డాఁచి యొరుల కుమారుని మేధంబున కుపయోగించుట యుత్తమ ధర్మ నిష్ఠుఁడవైన నీకు తగవే? నృపేంద్ర! ఈ బాలుని సద యుండవై విడిచి పుచ్చుము. మఱియొక జన్నంబు సేయుము. కౌశికుం డిట్లు ధర్మ పురస్సరంబుగాఁ బల్క హరిశ్చంద్ర మహీజాని యించుక యోజించి “తాపసోత్తమా! ధర్మ యుక్తంబులైన భవత్సూక్తు లస్మదాదులకు శిరోధార్యములు. అయినను నొకా నొక కారణంబున భవదాజ్ఞప్తిని నెఱవేర్ప జాలనందులకు నన్ను క్షమింప వేడెద. మహాత్మా! బహుకా

లంబ నపత్యుఁడనై యుండి పుత్రుఁ డొక్కఁడు పుట్టి పోయి
నను జాలుననెడి వెఱ్ఱి మమకారంబున "దేవా! నా కొక్క
తనయునిఁ బ్రసాదించితి వేని యబ్బాలు నే యాగ పశువుగాఁ
జేసి భవత్ప్రీతికరంబుగా జన్నంబు సేయుదు నని ప్రచేతసుని
ప్రార్థించితిని. నా ప్రార్థనం బంగీకరించి నా మొఱఁ బ్రసన్న
చేతస్కుఁడై వరుణుఁడు నా కోరిన తెఱంగున నొక్క తన
యునిఁ బ్రసాదించెను. ఆ బాలుఁడు భూపతనమైన దాది
శాపాయుధుఁడు రాజా! క్రతు వెప్పుడు సేసెదవని నన్ను
వెన్నంటి పీడింప దొడంగె. నేనును బహు కాలంబునకుఁ గల్గిన
యీ కుమారు నెడ మహా మోహంబు గలిగి సవసంబున విశ
సించుటకు మన స్సొప్పక పెరిగి పెద్దయై యుపనీతుఁడై సమా
వర్తము బడయువఱకు ప్రచేతసుని వేఁడి వేఁడి, మేధంబు
సేయక గడపుకొని వచ్చితిని. అంత నేను వరుణునకుఁ జేసిన
వాగ్దానం బింకను జెల్లింపకుండుట పాడి గాదని పుత్రమేధంబు
సేయ నాయత్త చిత్తుఁడనై సవన సంభారంబు సమకూర్చు
చుంటిని. నే నిట్లు యజ్ఞప్రయత్నంబున నుండ నా కుమారుం
డీ వర్తమానం బెటులనో నెఱింగి నాకుఁ దెలియకుండ నెటకో
పలాయనుఁ డయ్యె. వానికై నానా దేశ శైలారణ్యంబులు
వెదకించితిని. కాని వాఁడు లబ్ధుండుగాఁ డయ్యె. అంత నీటి
ఱేఁడరుదెంచి కుమారుఁడు పలాయనం బగుట యెఱింగి యది నాఁ
జేసిన కృత్యంబుగాఁ దలంచి కోపారుణిత నయనుండై 'రాజా!
పుత్రమేధంబు సేయక నన్ను మోసగించితివి. కాన భయంకర
జలోదరామయ పీడితుండవై యల్లాడు'మని శపించి చనెను.

నాఁటఁ గోలె దుర్భరంబగు జలోదరంబుఁచే బీడితుండ నగుచు నెవ్విధంబునను నిద్దారుణ రోగంబును నివారణంబు సేసికొనఁ జాలక యలమటించి, యలమటించి నానాఁటికి వ్యాధిబాధ దుర్భరంబగుడు నొక్కనా డస్మత్కుల గురుండైన వసిష్ఠ మహర్షి కడ కేగి యీ భయంకర రోగంబు నివారితంబయ్యెడు నుపాయంబు దెల్పి నన్ను గావు మని పాదంబులఁ బడి మొఱ లిడితి. నా దుఃఖంబు గని దయాకలితాంతః కరణుఁడై బ్రహ్మ తనయుఁడు రాజా! వరుణుఁడు మరల నీ యెడఁ బ్రసన్నుఁ డగుట తప్ప దీని కితరోపాయంబు లేదు. ఆతఁడు పుత్ర మేధంబునఁ గాని తృప్తుండు గాఁడు. పుత్రమేధంబు సేయ వలె నన్న నీ కొమారుఁడు నీ కందక పాఱిపోయె. అయిన దీని కొక్క యుపాయంబు గలదు. ఔరసుఁడు, దుహితాత్మజుఁడు, క్షేత్రజుఁడు, గోళకుఁడు, కుండుఁడు, సహోఢుఁడు, కానీనుఁడు, క్రీతుఁడు దత్తుఁడు నని పురుషునకు దశవిధ తనయులు గలరు. వారిలో కోరిన ధనం బొసంగి విల్చుకొన బడినవాఁడు క్రీత పుత్రకుం డనఁబడు గావున క్రీతపుత్రకు నొక్కని బడసి ప్రచేతస ప్రీతికరంబుగా సవనంబు సేయుము. దాన నయ్యుదక నాధుఁడు నీ యెడఁ బ్రసన్నుఁడై నీ యామయము వాపును. "మహర్షి యగు నస్మదాచార్యుఁ డీ రీతి వాక్రువ్వ నాశాహత మైన నా హృదయమున మరల నాశాంకురము మొలక లెత్తెను. అంత వసిష్ఠమహర్షిని వీడ్కొని క్రీతపుత్రకునికై వెదకఁ గడంగితిని. బహు దేశంబులు తిరిగి తిరిగి బహు ప్రయాసచే నీ కుమారునిఁ బడసితిని. వీనిని విడిచితినేని నా రుజ

వోపు వెఱపులేదు. కాన మహాత్మా! వ్యాధిగ్రస్తుండ నగు నాయందు దయదలంచి యనుగ్రహింపు” మనెను. హరిశ్చంద్రు డిట్లు వచింప విశ్వామిత్రుండాతనిం గని “రాజా! నీవు వ్యాధిచే నవయ వలయు నని నా తలంపు గాదు. నీ రుజా నివారణంబునకై యేను నీచే వేళ్ళింపు సవనంబు సేయించెద. నీ వీ బాలుని విడువుము. మెయితో దివిం జేర నభిలషించెడు భవజ్జనకుని స్వర్గమున కుద్గమింపం జేసిన నా సామర్థ్యంబు నీ వెఱుగవే? ఇంకను శంకించెద వేల?” యనెను. గాధేయుం డిట్లు లన నిజ జనకుని దుస్థితి దలంచుటచేం గలతయుం గోపంబును జెందిన వాడై హరిశ్చంద్రుండు “తాపసోత్తమా! యుష్మత్సామర్థ్యం బును విశ్వసించుటం జేసియే యస్మత్పితరుండు దివియు భువియు గాని మధ్యమార్గంబున నధశ్శిరస్కుండై యల్లాడుచు న్నాడు. కాన నీ యాజకత్వ మేనొల్ల. నరమేధంబు మాన. బాలుని విడువ నని నిష్ఠురంబుగాం బల్కెను. హరిశ్చంద్రు డిట్లు కఠినంబుగా వచింపం గోపించి విశ్వామిత్ర మునివరుం డాతని వీడి శునశ్శేఫుని కొక వారుణమంత్రం బుపదేశించి కుమారా! ఈ మంత్రం బహర్నిశ లేమరక భక్తియుక్తుండవై జపించుచుండుము. వరుణుండు నీ యందుం బ్రసన్నుండై ప్రాణ దానంబు సేయు నని వచించి వెడలిపోయెను. అంత హరిశ్చంద్ర సార్వభౌముండు శునశ్శేఫసహితుండై నిజనగరంబున కరిగి నర మేధంబున కుపక్రమించెను. బాలుండగు శునశ్శేఫుడు విశసన కాలంబుననైన భీతుండుగాక మంత్రంబు మఱవక పరమభక్తి తాత్పర్యంబుల జపించుచుండెను. శునశ్శేఫు డిట్లు మహాభక్తితో

ప్రచేతసు నుపాసింప మహనీయంబగు నమ్మంత్ర ప్రభావం బున నాతని యెడ బ్రీతుండై వరుణుండబ్బాలునిఁ గావనెంచి తక్షణమే ప్రత్యక్షమయ్యెను. ఉదకనాథుం డిట్లు బాలరక్షణా తత్పరుండై యరుగుదేరం గని హరిశ్చంద్రుం డాతని పాదం బులకుఁ బ్రణమిల్లి "వరుణదేవా! నేఁడు నా భాగ్యం బేమని కొనియాడుదును? సాపరాధుండనైన నాయెడఁ గృపామతివై నిజరూపంబునఁ బ్రత్యక్షమైతివి? దేవా! పుత్రమోహంబున నీ కొసంగిన వాగ్దానంబునకు భిన్నంబుగా వర్తించి తత్ఫలం బను భవించితిని. ఇఁకనైన నా యందుఁ గరుణఁ బూని దుస్సహం బైన యీ యామయమునుండి నన్ను విముక్తునిఁ జేయుము. ప్రాణభయంబున వెచ్చనూర్చెడి యీ విప్రకుమారుని పరి రక్షింపుము. నన్ను ధన్యుం జేయు మని ప్రార్థించెను. హరిశ్చం ద్రుని ప్రార్థనం బంగీకరించి యాతని యెడఁ బ్రసన్నుఁడై వరు ణుఁడు శునశ్శేపునకుఁ బ్రాణదానంబు సేసి హరిశ్చంద్రుని రుజావిమోచనంబు గావించి నిజేచ్ఛం జనెను. దేవతలచే విడు వఁబడిన వాఁడు గావున శునశ్శేపుఁడు నాఁటఁగోలె దేవరా తుండనఁ బ్రసిద్ధుఁడయ్యె.

తండ్రి వరుణానుగ్రహంబు వడసి రోగవిముక్తుఁ డయ్యె నని తెలిసి హరిశ్చంద్రుని తనయుఁడైన లోహితుండు భయ దూరుండై నిజనగరంబున కరుదెంచి తండ్రి యాదరంబుఁ బడసి సుఖంబుగ నుండెను.

## తొమ్మిదవ ప్రకరణము.

యమ వరుణ కుబేరాది దిక్పాలకాలంకృతంబై, గరుడ గంధర్వ కిన్నర కింపురుష విద్యాధరాది బృందారక సందోహ సంసేవితంబై, వసిష్ఠ విశ్వామిత్ర వామదేవ కశ్యపాంగీరస భరద్వాజ నారదాది మునిగణ విరాజితంబై, రంభ మేనకో ర్వశీ తిలోత్తమాది యప్సరాంగనా శోభితంబై, దేవగురు పూజితంబై యొప్పు మిగిలెడి దేవసభయందు సుధర్మాసనా సీనుండై వేయిగన్నుల వేల్పు పేరోలగం బుండ ప్రస్తావ వశం బున మర్త్యలోకంబునఁ గల రాజన్య చూడామణులలో నిత్య సత్య వ్రతుండగు వా డెవ్వ డను ప్రశ్న వచ్చెను. సభాసదు లెల్ల రట్టి సత్య వ్రతుం డగు రాజేంద్రుఁ డెవఁ డని తమతమ మనంబుల యోజించుచుండిరి. అట్టియెడ మునికుల సార్వభౌ ముండైన వసిష్ఠమహర్షి సభాసదులం గని "సభికవరులారా! మీ సంప్రశ్నంబున కీతఁ డని చూపగల సత్యశీలుఁ డయోధ్యా పురాధి నాథుండును, రాజసూయాది మహాధ్వర కర్తయు, సద్వృత్త సుగుణగణాలంకారుఁడును నైన హరిశ్చంద్ర సార్వ భౌముఁ డొక్కడే. అమ్మహామహుఁడు కలయందైనఁ గల్లలా డఁడు; పరిహాసంబునకైనఁ బల్కు లేదనఁడు. అర్థులకు లేదను టయు నాహవంబుల వెనుదీయుటయు నా సార్వభౌమున కపరిచిత విషయంబు" లని నొక్కి పల్కెను. బ్రహ్మతనయుం డిట్లు హరిశ్చంద్రుని సత్యనిరతిని నొక్కి వక్కాణింప నాతని మాట లంగీకరింపక విశ్వామిత్ర మునీంద్రుఁడు "ఆహా! ఏమి వసిష్ఠుని వచనంబులు! మునికుల సార్వభౌముఁడై నందులకు

వెదకి వెదకి మంచి సత్యనిష్ఠునే చూపెను? హరిశ్చంద్రుని గుణగణములు చక్కఁగ నెఱుఁగనివారి కడ నిట్టి పలుకులు పలికినఁ బలుకనగును గాని "యమ్మ పుట్టిల్లు మేనమామ యొద్దఁ బొగడి" నట్లు హరిశ్చంద్రుని యవగుణంబులు స్వయముగా నరసిన మాకడ నీ స్తుతు లెట్లు చెల్లును? ముంజేతి కంకణమున కద్దమేల? నిన్న మొన్ననే గదా పుత్రమేధంబు చేసెద నని నమ్మించి కుమారునిఁ బడసి పిదపఁ జేయక యీ వరుణుని మోసగించె. శునశ్శేపుని విడిచి పుచ్చుమని నే నెన్ని విధంబులఁ జెప్పిన వినక నన్నధిక్షేపించి దయావిహీనుండై యాతని యజ్ఞపశువుగా వినియోగించె. నా మంత్ర ప్రభావంబున నా బాలుఁడు జీవితుం డయ్యె. నిజమిట్టు లుండ నట్టి దుర్నీతిపరుం డగు త్రిశంకువు సమస్త సద్గుణోపేతుం డనియు, నిత్య సత్య వ్రతుఁడనియుఁ బల్కిన నలుగురు నగరే? ఈ వసిష్ఠుఁడా రాజేంద్రుని యింటి పురోహితుం డగుట వారి యింటఁ గుడిచిన యిష్టమృష్టాన్నములకును గొనిన భూరిదక్షిణలకును మేలికార్పాసంబులకును బ్రీతిగా నాతని నిట్లు స్తుతించి ఋణంబుఁ దీర్చుకొనుచున్నాఁడు. ఇట్టి యనుచితపుఁ బొగడి తలు పురోహితుల కుండెడి లక్షణమే గదా" యనెను. గాధేయు డిటులఁ బరుషంబుగాఁ బల్కఁ గోపించి మైత్రావరుణి "విశ్వామిత్రా! నీవు తామసివి; మూర్ఖుఁడవు; యుక్తాయుక్తము లెఱుఁగవు. ఇట్టి బాలిశమతి వగు నీ వా మహనీయుని సద్గుణంబు లెట్లు తెలిసికొనఁగలవు. అమ్మహారాజు ధర్మమునకు ధర్ముఁడు; క్షమకు క్షమ; తేజమునకు సూర్యుఁడు; చల్లఁదనము

నకుఁ జంద్రుఁడు; బుద్ధికి బృహస్పతి; ఆ పరనారీసహోదరు
నిచే మర్త్యలోకము పావనమైనది. అర్థులకుఁ బెరటికల్పమును,
దీనులకుఁ జింతామణియు, శరణాగతులకు మందారమును,
వేల్పులకుఁ గామధేనువును నగు నా రాజేంద్రుఁడు సత్యవ్రత
మున నప్రతిముఁడు. గాధేయా! వారి యింట విందు లారగించు
టచే నిట్టు లనుచుంటివని పల్కుచుంటివి గా? సతీసుత సేనా
సమేతముగా మా యింట విందుఁగుడిచి యింతకు వచ్చిన నీవు
మా భోజనంబుల సార మెఱుఁగవే? యనెను. వసిష్ఠమునివరుం
డిట్లు తీక్ష్ణంబుగాఁ బల్క రోషకషాయితాత్ముండై విశ్వా
మిత్రుఁడు వసిష్ఠా! ఆ రాజేంద్రుఁడు సతత ఋతవాదియనియు
వితరణ శీలుండనియు నీ వింతగఁ బంతములు పల్కుచున్నాఁ
డవు, నేను గాదనుచున్నాను, ఇఁక వాదోపవాదము లెందుకు?
ఆ హరిశ్చంద్రునికడ కేగి యాతని నదాతగను ననృత వాది
గను నేను ఋజువొనర్తును. దీనికి నే నోడుదునేని యస్మదీయ
ఘనతపోసమార్జితఫలం బెల్లఁ గోల్పోవుదును. నీ వోడిన నీ
బ్రహ్మపదంబుఁ గోల్పోవలయును. దీనికొడఁబడు మనెను. అనిన
వసిష్ఠ మునీంద్రుఁడు స్మితాననుఁడై కౌశికమునీంద్రా! అటులనే
కానిమ్ము. నీ వెన్ని మాయలు పన్నినను, నెన్ని బన్నంబులు
కలుగఁ జేసినను మా రాజేంద్రుఁడు సత్యచ్యుతుఁడు గాఁడు.
హరిశ్చంద్ర ధరాజానియే యనృతవాది యయ్యె నేని ప్రభా
కరుఁడు ప్రాగ్దిశ నుదయించుట మాని పశ్చిమంబున నుదయిం
పఁడే? క్షపాకరుఁడు శైత్యంబు వీడి యుష్ణంబు వహింపఁడే?
పట్టపగలే గగనతలము తారాగణ విరాజితంబుగాదే?

గాధేయా! చనుము. నీయిచ్చ వచ్చిన తెఱంగున నా నృపాలోత్తముని శోధింపుము. దాన నతఁడోడిన నా బ్రహ్మపదంబేగాక నా సర్వసుకృతంబులును ధారవోయుదును. దీనికీ దేవసభయందలి సభాస్తారులే సాక్షి." యని దృఢంబుగాఁ బల్కెను.

అంతట సభ ముగిసెను. వసిష్ఠ విశ్వామిత్రులలో నెవ్వరు జయంబుఁ గొందురో యని సురలును, మునులును తమతమ మనంబుల వితర్కించుకొనుచు నిజనివాసంబుల కరిగిరి.

---

## పదవ ప్రకరణము.

హరిశ్చంద్ర సార్వభౌముఁ డొక్కనాఁడు మంత్రి సామంత పరివార సమేతుండై నిండు కొలువుండ నుపవన పాలకు లరుదెంచి "రాజేంద్రా! ఎక్కడిదో యొక సూకరం బరుదెంచి యుపవనం బెల్ల ధ్వంసంబుచేసినది. దానిని బాఱఁ ద్రోల నేగు వారి నెదిరించి మట్టు పెట్టుచున్నది. అప్పుడే దాని దౌష్ట్యమున కాగలేక వనపాలకులలోఁ బెక్కురు నశించిరి. హతశేషులమైన మే మెట్టులనో యా మాయా దంష్ట్రి బాఱినిఁ బడక తప్పించుకొని దేవరకీ విషయం బెఱిగింప నరుదెంచితి" మని మొఱ వెట్టిరి. అవ్వార్తమానంబు వినిన వెంటనే హరిశ్చంద్ర సార్వభౌముఁడు సభఁ జాలించి యారామపాలకుల 'కే నిదే వచ్చుచుంటి యా పంది నిప్పుడే సంహ

రించి మీ యీ యాపద బాపెదను భయంబు వీడి చనుఁడని వీడ్కొల్పి శర శరాసనంబులు ధరించి సముచిత పరివారుండై యవ్వరాహంబును సముఖింపఁ జనెను.

విశ్వామిత్రుని పంపున నరుదెంచిన యీ మాయా క్రోడంబును హరిశ్చంద్రుఁడు గని భీతిఁజెందక ఫలవృక్షంబులఁ గూలఁద్రోయుచు, పుష్పమంజరులఁ ద్రెంపుచు, రమ్య నికుంజంబులఁ బెల్లగించుచు, క్రీడాసరోవరంబుల గలంచుచు యథేచ్ఛముఁగా విహరింపఁ దొడఁగె. అవ్విధి నిర్భయంబుగ విహరించెడు సూకరంబును గని కోపఘూర్ణితాంతరంగుఁడై మండి పడుచు సార్వభౌముఁడు కోదండంబు నెక్కిడి నిశితమార్గణంబులు దానిపైఁ గురియింపఁ జేసెను. అమ్మాయా సూకరంబును నా నరేంద్రుని శరాపాతంబున కందక పరువెత్తిన గోలఁది రెట్టించిన కట్టలుక సార్వభౌముఁ "డెట్టులైన యీ కపట దంష్ట్రి మట్టుపెట్టినఁగాని పట్టణంబున కేగ" నని పట్టు బట్టి దాని వెంటాడి కడు దవ్వరుగ దొడఁగె. ఇటుల బహు దూరంబు రాజును గొనిచని యీ వరాహంబా మానవేంద్రుని కందక గిఱుకరించి యెందో నదృశ్యమయ్యెను.

వరాహము మాయమయ్యె. పరివారము దూరమయ్యె. మరల ననుచరుల గలిసికొన నేగుద మనినను మట్ట మధ్యాహ్నమైనది. ఎండ తీక్ష్ణముగా నున్నది. అట్టియెడ నింకను బ్రయాణంబు సేయఁజాలక హరిశ్చంద్ర సార్వభౌముఁడు సమీపంబునఁ గల కమలాకరంబునఁ బిపాసానివారణంబు గావించికొని పొంతనున్న చెట్టునీడఁ బవ్వళించెను.

ఇట్టు లొక్కింత తడవు విశ్రమించి లేచి హరిశ్చంద్రుఁడు నిజ నగరంబున కేగ యత్నింప నెటుఁ జూచినను దెఱువు కనుపింపదయ్యె. సూర్యచంద్రులకు లేని వింత వెలు గెద్దియో దశదిశల నావరించి యుండెను. ఆ వింతనరసి భ్రాంతుఁడై రాజేంద్రుఁడు ఏమిది? పవలా! రాత్రియా! పగలైన సూర్యుడేడి? రాత్రియైన నక్షత్రము లేవి? క్షపాకరుం డెక్కడ? అక్కటా! ఏదియో యైంద్రజాలికముగ నున్నదే? ఏమిచేయుదును? ఎటుల రాజధాని కేగుదును? ఈ భయంకర కాననంబున నాకుఁ దోడ్పడి నగరంబునకుఁ జేర్చువా రెవ్వరు? అయ్యో! దైవమా నేఁడేల న న్నిట్లు వేసటఁ బెట్టుచున్నాఁడవు?" అని విచారపరీతస్వాంతుఁడై యావృక్షచ్ఛాయఁ గూర్చుండి యుండెను.

మాయావిలోల హృదయుండై నేమియుఁ దోఁచక సార్వభౌముఁ డబ్బంగి విచారించుచుండ నెందుండియో విశ్వామిత్రుఁ డట నూడిపడెను. ఆ మునివరుఁ జూచినంతనే హరిశ్చంద్ర మహీజాని యత్యంతానందంబుఁ జెంది కరకంజంబులు మోడ్చి నమస్కరించి తాపసోత్తమా! ఏమి నా భాగ్యము? దిక్కు తెలియక కల్గాను నీ యెడ నాకు దైవము వలెఁ బ్రత్యక్షమైతివి? కాన నింక నా యాపద తీఱె. నా యదృష్టంబు ఫలించె. తపోధనా! రాజధాని కరుగవలయు నన్నుఁ దెన్ను తోఁపకున్నది. మహనీయ ప్రభావుండ వగు నీవైన నాకుఁ దెఱువుచూపి పుణ్యఁబుగట్టుకొమ్మని దీనంబుగా వేఁడికొనెను. మహారా జిట్లు ప్రార్థింప విశ్వామిత్రుఁడు "రాజేంద్రా!

భయములేదు నీవు నీ పట్టణంబున కేగెడి మార్గము నే జూపెదను. ఇప్పుడే వెళ్ళవచ్చును. కాని యొక్క ప్రయోజనంబు గోరి నీ కడ కరుదెంచితిని. దానిని నెఱవేర్పక వెళ్ళుదువే?" యనెను. అనిన హరిశ్చంద్రుఁడు మహాత్మా! మీ వంటి తపోధనులు నాకై పనిబూనివచ్చిన మీ ప్రయోజనంబు లరయక వెళ్ళుదునే; రాజధాని మీకంటె ఘనంబే! తాపసోత్తమా! ఈదాసునితోఁ దమకు గావలసిన కార్యంబేమి? యనెను. అనిన సంతోషితస్వాంతుఁడై గాధినందనుఁడు రాజేంద్రా! నీవు వితరణ ఖనివనియు, నిన్నర్థించి విఫలురైన యర్థులిద్దర లేరనియు జగంబులు నిన్నశంబు కీర్తించుచుండును. మహనీయంబగు నొక యధ్వరంబు సేయనెంచి యర్థార్థినై నీకడ కరుదెంచితిని. నా కోరిన ధనంబొసంగు మనెను. అనిన వినయవినమిత మస్తకుండై హరిశ్చంద్రుఁడు మహాత్మా! మీ వంటి తాపసోత్తము లర్థకాములై నాకడ కరుదెంచుట నా భాగ్యంబు గాదె! కాన మునీంద్రచంద్రమా! అర్థమే గాదు నా నిఖిలరాజ్యంబొసంగుమనినను నిప్పుడే మీ చరణంబుల కడ నర్పింతు ననెను. అనిన విశ్వామిత్రుఁ డాతనిఁ గని "రాజా! ద్రవ్యమడుగ సర్వరాజ్యమే యర్పించెద నంటివి. మంచిదటులనే యొసంగుము. సూనృత వ్రతులగు నిక్ష్వాకువంశ సంజాతుండవైన నీ వాడితప్పరాదు సుమా" యనెను "తపోధనా! ఇచ్చెద నని యీయకున్న నిరయంబుఁ బ్రాపింపదె! నా నిఖిలరాజ్యంబు నీ కిచ్చితిని; ముమ్మాటికిచ్చితిని. నిఖిలదేవతాసాక్షిగా నిచ్చితి" నని సార్వభౌముఁడు మరల

దృఢంబుగాఁ బల్కెను. హరిశ్చంద్రుఁ డిట్లు దృఢంబుగాఁ బలుక లోలోన నుప్పొంగుచు గాధిసూనుఁడు "రాజా! నీ త్యాగశీలతకు మెచ్చువచ్చెను. కాని పక్షములు లేని పక్షియు, నక్షములేని బండియు, దక్షిణలేని దానంబును వ్యర్థము"లని పెద్దలు వాకృత్తురుగదా, నీ భూరిదానంబునకు దక్షిణ యేమి యొసంగెదవనెను. అనిన నేమికోరిన నది యని సార్వభౌముఁ డనెను. "హేమభారద్వయము నార్థమ్మొసంగు మని విశ్వామిత్రుఁ డడిగెను. చిత్తమని యా దక్షిణ ధనంబును గూడ నొసంగుటకు సార్వభౌముఁ డంగీకారము దెలిపెను. అంతఁ గౌశికుఁడు నితాంతసంతోషంబున హరిశ్చంద్ర ధరాజానినిఁ బెక్కు భంగుల శ్లాఘించి రాజేంద్రా! నా దాన దక్షిణలఁ గొనుటకై యనతి కాలంబులో నేను మీ రాజధాని కరుదెంచెదను. అంతవఱకు రాజ్యంబును నీవే పాలించుచుండు మని యాదేశించి పట్టణంబున కేగెడి పథంబుఁ జూపి యదృశ్యుఁ డయ్యెను.

నిజపురంబున కరుదెంచిన వెనుక తాఁ గావించిన యవివేకమును హరిశ్చంద్రుఁడు గుర్తించెను. "అయ్యో! మచ్చుఁ జల్లిన చందమున గాధేయుని వచనంబులకు వంచితుఁడనై యెట్టి తెలివిమాలిన పనిచేసితిని. మునుముందు సర్వరాజ్యంబు కౌశికునకు దానంబుసేసిన వెనుక దక్షిణధన మెట్లియ గలను? అదియు కొంచెము గాదే? భారవాహములగు నొక్కొక జంతువున కిరువైపుల మోయగలంత స్వర్ణభారమును వేయవలెను. అట్టి పెక్కుజంతువుల సమూహమును, గదా సార్థ

మందురు. విశ్వామిత్రుఁ డెన్ని జంతువులుగల సార్థమును దెచ్చునో? అవియున్నియు మోయఁగలంత బంగారమును నే నెచ్చటినుండి తెచ్చి యీయఁగలను?" అని లోలోనఁ జింతింపఁ దొడంగెను. ఈ విచారంబునఁ దగిలి యమ్మహీజాని రాచకార్యంబులు చక్కఁబెట్టఁ డయ్యె, సచివులతో సమాలోచనంబు సేయఁడయ్యె, అంతఃపురంబునకుఁ జని నిజసతియైన చంద్రమతితోనైన సల్లాపంబు లాడఁడయ్యె. ఇట్లు నిరంతర చింతాపరీతస్వాంతుఁడై నానాఁటికిఁ గార్శ్యశరీరుఁడగుచున్న జీవితేశ్వరునిఁ గాంచి దిగులొంది పట్టమహిషియైన చంద్రమతి యొకనాఁడు నిజనాథునిఁ జేరి ప్రాణేశ్వరా! మీ రిట్లు నిరంతర చింతాదోదూయమానమానసులై యుండుటకు గతంబేమి? ప్రచేతసుఁడు ప్రసన్నుఁడయ్యె. మీ వ్యాధిపీడయుఁ దొలంగె. కుమారుఁ డింటికివచ్చె. అనన్యదుర్లభంబగు రాజసూయ మహాధ్వరంబు నిర్వహించితిరి. మీవంటి సత్యవాదియు, వదాన్యుఁడును లేడని జగంబులఁ బ్రసిద్ధిఁ బడసితిరి. మీ కేమిటఁ గొఱత? మీరిటుల వగఁగూరుటకు గతంబేమి? యని వినయంబున నడిగెను. అనవుడమ్మనుజేశ్వరుఁడు చంద్రమతిం గని ప్రియసతీ! నీవు చెప్పినట్లు నాకేమిటను గొఱతలేదు. మహాత్ముఁడగు కౌశికమునీంద్రుఁడు నిఖిలరాజ్యంబు దానమీయుమనిన నిచ్చితిని. దానికిని విచారములేదు. కాని దానంబునకు దక్షిణగా హేమభారద్వయము సార్థమొసంగు మనిన నిచ్చెదనంటిని. పూరిపుడకయైన సొంతమున కుంచుకొనక యెల్ల రాజ్యము మౌనీంద్రునకు ధారవోసిన వెనుక దక్షిణాధనము

తాపసోత్తమున కెటులీయఁగలను? ఈయకున్న నిత్యసత్యవ్రతులగు నినవంశీయులకు నా మూలమున నసృతత్వదోష మాపాదిల్లు నేమో యని శోకించుచున్నవాఁడ. దేవీ! ఇదియే నామనః క్లేశమునకుఁ గారణ మని విచారభరంబున శిరమువంచెను. సత్యభంగదోషాభయంబున నప్పగిది విచారించెడు జీవితేశ్వరునిఁ గని సాధ్వీమణియైన శైబ్య "ప్రాణేశ్వరా! దీనికింతవంతఁ జెందనేల? నిఖిలరాజ్యంబుఁ దన కొసంగిన వెనుక మనకడ నింక ధనము లేదనియు మనము వంచకులము గామనియు నాసంయమిచంద్రుఁ డెఱుఁగఁడే! ఎఱిఁగియు మనల నేల పీడించును. సర్వస మర్పించిన యనంతరము మీ కసృతత్వదోషము మాత్ర మేల వచ్చును? ఒకవేళ యెఱిఁగి యెఱిఁగి తపసి మిమ్ములఁ బీడించునేని మీ ధనమైన నేను లేనే? కొమారుఁడు లేడే? మమ్మెవ్వరికైన విక్రయించి తపసిబుణము దీర్చి మీ సూనృత వ్రతమును నిలుపుకొనరాదే! యనెను. పరమ పతివ్రతా శిరోమణియైన చంద్రమతీదేవి చింతాక్రాంతచిత్తుఁ డగు పతి నిటుల నోదార్పువచనంబులఁ దేర్చుచుండఁ గౌశిక మునీంద్రుఁ డరుదెంచి, రాజా! పూర్వపత్తంబైన రాజ్యం బస్మ దధీనము గావింపు మనెను. వెంటనే హరిశ్చంద్రుఁడు లేచి సతీ యుతుఁడై విశ్వామిత్రమునివరునకు నమస్కరించి తన రాజ ముద్రిక నాతని కరకమలంబుల నిడి "సంయమిచంద్రమా! అస్మత్పరిపాలిత ధరాచక్రమెల్ల భవదధీన" మని మరల చేతులు జోడించెను. "అయిన నా దక్షిణాద్రవ్య మెప్పుడొసంగెద" వని కౌశికుఁడు ప్రశ్నించెను. "మునికులావతంసమా!

నీ దక్షిణాధనమును గూడ నిచ్చెదను కాని కొంతకాలము గడుపీయవలయు” నని హరిశ్చంద్రుఁడు దీనంబుగాఁ బలికెను. అనవుడు విశ్వామిత్రుఁ డాతనిఁ గని రాజా! అఖిలసామ్రాజ్య మాస్మదధీనము గావించి కట్టు పుట్టంబులతో నున్న నీవు నా కీయవలసిన భూరిదక్షిణ నెట్టులీయగలవు? లేదనరాదే? కాద నకఁ బోయెద ననెను. అనిన హరిశ్చంద్రుఁడు “హరిహరీ” యని చెవులు మూసికొని మౌనిసత్తమా! అవి యేటిమాటలు. తొలుత యిచ్చెదననిన లేదనిన నిరయంబుఁ బ్రాప్తింపదే? మానధనులకు మాటఁదప్పుట యాత్మహత్యకన్న నధికతరము గదా, మహాత్మా! ఒక మాసముదినములు గడువిమ్ము ఈ లోపు నెట్టి నీచపుటూడిగమున కొడబడియైన నీ కీయవలసిన ధనమును సేకరించి నీ కొసంగెద’ ననెను. హరిశ్చంద్రుని వేఁడి కోలు నంగీకరించి విశ్వామిత్రుఁ డా రాజేంద్రునకు నెలదిన ములు గడువొసఁగి “రాజా! నాకీయవలసిన దక్షిణాద్రవ్య మునస్మచ్ఛిష్యుఁడైన యీ నక్షత్రకున కొసంగునది” యని యాదేశించి వెడలిపోయెను. హరిశ్చంద్ర సార్వభౌముఁడును సర్వరాజ్యంబు విశ్వామిత్రుని యధీనంబు గావించి పుత్రకళత్ర యుతుఁడై కాశీకానగరంబున కరిగెను. నక్షత్రకుఁడును వారిని వెంబడించె.

---

పదునొకండవ ప్రకరణము.

“రాజా నీ కీ బాధయేల? బ్రాహ్మణ మంతయు నస్మద్గు రుని యధీనంబు చేసిన నీవా భూరి ధనంబు నెట్లు పడయ

గలవు? సమర్థతలేని యెడ నిచ్చెదనని ప్రగల్భంబులేల? లేదని యొక చిన్న బొంకు బొంకిన క్షణములో ఋణ విముక్తుండవై సుఖంబున నుండ వచ్చును గాదె? నృపాలా! ఇంత చిన్న మాట కింతే పంతంబు బూని వంతలు పడనేల? యని హితం బుపదేశించిన చందమున నక్షత్రకుఁడు హరిశ్చంద్రుని మాటి మాటి కనృతంబాడఁ బురి కొల్పుచు దాని కాతఁ డొడఁబడ కున్న హరిశ్చంద్రా! మా ద్రవ్యము మా కొసంగుము. ఎంత కాలము బంటు చందమున నీ వెంటనంటి యూళ్ల వెంట తిరుగు మనెదవు? గడువు సమీపించుచున్నది. తేవు మా పని నీ వీ విధమునఁ గాలయాపనము సేసిన మా దేశికునిచే మాకు మాటరాదే? యని ధనంబునకై యొత్తిడి చేయుచు బహు భంగుల బాధించుచుండెను. విశ్వామిత్రు నాదేశంబున నక్షత్రకు డిట్లు బహువిధంబుల రాయిడి పెట్టుచుండ మనః క్లేశము చెందుచున్న వాఁడయ్యు హరిశ్చంద్రుఁ డనృతాభి ముఖుఁడు గాక "నక్షత్రక! జీవిత మనశ్వరము. ఇహ సంపదలు క్షణ భంగురములు. మాటకు సత్యమే ప్రాణము. సత్య రహితమైన వాక్కు మృతవాక్కు. కాన నట్టి నిరయ హేతుకంబులైన మృషావచనంబులకు నన్నేలఁ బ్రేరేపించెదవు? యుష్మద్గురు వర్యున కీయ వలసిన సొమ్మును నాభార్యా సుతుల విక్రయించి యైన యొసంగెద"నని దృఢంబుఁ బల్కుచుండెను.

ఇట్లు తపసి ఋణంబుఁ దీర్చ వెఱవు గానక హరిశ్చంద్రుఁడు విచారించుచుండ మాసము దినముల గడువు సమీపించెను. అట్టి యెడ సంయమి దత్త ధనంబీయ నితరోపాయం

బులేక హరిశ్చంద్రుఁడు వారణావత పురవీధుల భార్యాపుత్రుల
నమ్మఁజూపెను, కౌశికముని ప్రేరణంబున నొక వృద్ధ విప్రుఁడు
హరిశ్చంద్రుఁడు కోరిన ధనం బొసంగి చంద్రమతీ రోహితుల
విల్చుకొని పోయెను. ఆధనము సంయమి కొసంగి హరిశ్చం
ద్రుఁడు ఋణ విమోచనంబు బడయఁగోర నక్షత్రకుఁడు
రాజా! ఈ ధనమెల్ల నీ మాసము దినములనుండి నీ వెంట
నంటి తిరిగినందులకు బత్తెముగా నాకే చెల్లిపోయెను. ఇక
నీవు మాగురుని ఋణముఁ దీర్చిన దెక్కడ? ననెను. అవ్వా
క్యంబు లాలించి హరిశ్చంద్రుఁ డశోకోపహత చేతస్కుఁడై
యక్కటా! భార్యా పుత్రుల విక్రయించినను విశ్వామిత్రుని
యప్పు తీరకపోయె. ఇఁక నేమిసేతును. ఏవిధంబున నీ ఋణ
బాధ బాపుకొందును? ఓ దైవమా! నన్నేల యిట్లు సిలుగులఁ
బెట్టుచున్నావు? ఓ మృత్యువా? నీ వైన ననుఁ గొనిపోయి
నా కష్టము దీర్పుమని నేలఁ గూలెను. రాజేంద్రుఁ డిట్లు
దుఃఖాహత హృదయుఁడై నేలఁ గూలుటఁగని విశ్వామిత్రుఁ
డు ప్రత్యక్షమై రాజా! ఏది నా దక్షిణ ధనము? నాయప్పు
దీర్పక యసువులు వీడ నుంకించుచుంటివా? ఏమి నీ సత్య
వ్రతము! నాధనం బీయక నీవు ప్రాణ విముక్తుండ వైనను
ఋణ విముక్తుండవు గావు సుమా. కాన సత్యనిష్ఠితుండ వగు
దువేని యస్మద్దత్త ధనం బొసంగుము. కాదేని లేదనుము
పోయెదననెను. విశ్వామిత్రుఁ డిట్లు కఠినంబుగాఁ బలుక
తెప్పి ఱిల్లి లేచి హరిశ్చంద్రుఁడు తాపసోత్తమా! నీ దక్షి
ణకు భయంబులేదు. ఎవ్విధంబున నైన నీ యప్పు దీర్చిగాని

నే నసువుల వీడను. ప్రాణచ్యుతికైన నోడంబడుదును గాని సత్యచ్యుతి కంగీకరింపను. ఇదిగో! అస్మచ్ఛరీరం బొరుల కూడి గంబునకైన విక్రయించి నీ ద్రవ్యము నీ కొసంగెద"ననెను. సరే, అటులనే కానిమ్మని విశ్వామిత్రుఁడం తర్హితుఁడయ్యెను. అంత హరిశ్చంద్రుఁడు దనకుఁ దానై కాశికాపుర బాహ్యం బునఁ గల కాటి కాపరియైన ఛండాలున కమ్ముడు వోయి తపసి ఋణముఁ దీర్చెను. హరిశ్చంద్రుని సత్య దీక్షకు నిఖిల జగంబులు హర్షించెను. కాని యంతతోనైన విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రుని శోధించుట మానలేదు. బ్రాహ్మణుని యింట దాసీత్వము సేయుచున్న చంద్రమతీ దేవి యా యింటి యిల్లాలైన కలహకంఠిచే నానాబాధలు పడునట్లును నామె తనయుఁడైన రోహితుఁడు సమిత్కుశ ఫలాహారణార్థంబై కాననంబున కేగి యట సర్పదష్టుఁడై మరణించు నట్లును జేసెను. మహా సాధ్వియైన చంద్రమతీ దేవి పుత్ర మరణంబు విని దుఃఖించుచు బ్రాహ్మణుని గృహ కృత్యంబు లెల్లఁ దీర్చి వానిచే ననుజ్ఞాతయై నిశాసమయంబున పుత్రుఁడు మరణించిన యరణ్యంబున కేగి యాబాలుని ముందిడుకొని కొంత తడవు వనవి వనవి వాపోయి యనంతర మా బాలుని బుజముపై నిడుకొని దహన సంస్కారార్థము కాటికిఁ గొనిపోయెను. అట కాటికాపరితనము సేయుచున్న హరిశ్చంద్రుఁడు శవచేలాప హారణార్థ మా మృతుని కడ కేతెంచి యా బాలుని తన ప్రియతనయునిగను, నామెను దన పత్నిగను గుర్తించి యేకైక పుత్రవియోగంబునకు భార్యాసహితంబుగ బిట్టు దుః

క్షించి యనంతరము స్వామికార్యనిర్వహణార్థ మొకింత యూరడిల్లి "సతీ! ఈ మృతబాలకు డస్మత్తనయుఁడైన నగుగాక నీవు నా ప్రియ పత్నివైన నగుదువుగాక కాటి సుంకమీయక నీ బాలు నిచట దహనము సేయనీయను. ఇది నా స్వామియైన వీరబాహుని యాజ్ఞయనెను. నిజనాథుని వచనస్థితి నెఱింగినది గాన చంద్రమతి కాటిసుంకము గొనివచ్చుటకై తన యజమానుని యింటి కరుగుచుండెను. ఇట్లు వచ్చుచుండ మార్గమధ్యమున రాజగారి పుత్రుని సంహరించి యా బాలకుని మెయి తొడవు లూడ్చుకొని వచ్చుచున్న చోరులు కొందఱు రాజభటులు వెంటాడుటచే భయముజెంది దమకడ నున్న నగలమూటను యజమాని యింటి కేగుచు నెదురు పడిన చంద్రమతి యొడిలో వైచి పాఱిపోయిరి. రాజకుమారుని నగలతోఁ గూడ చంద్రమతి రాజభటులకుఁ బట్టువడెను. దయారహితులైన యా రాజభటులు చంద్రమతినిఁ దిట్టుచు, కొట్టుచు రాజు సన్నిధికిఁ గొనిపోయిరి. పుత్త్ర వియోగమునఁ బొక్కుచున్న యా రాజేంద్రుఁడు నగలతోఁ గూడ నెదుటకు గొనిరాబడిన చంద్రమతినిఁ జూచి శోకదందహ్యమానుఁడును, నాగ్రహోదగ్రచిత్తుండును నై నీ బాలహంత్రినిఁ గొనిపోయి వీరబాహునిచే శిరచ్ఛేదము సేయింపు డని యాజ్ఞాపించెను. రాజాజ్ఞానుసారముగా నామెను సేవకులు వీరబాహునికడకుఁ గొనిపోయి ప్రభుని యుత్తరువునుఁ దెల్పిరి. వీరబాహుఁడా కృత్యంబు సేయుటకుఁ దన బానిసీఁడైన హరిచంద్రుని నియమించెను. తాను శిరచ్ఛేదము సేయవలసిన యింతి తన

కాంతయైన చంద్రమతి యనియు నామె నిరపరాధ యనియుం దెలిసియు యజమాని పంచిన కృత్యంబు లెల్ల సేయుట కొడబడిన హరిశ్చంద్ర ధరాజాని సత్యనిరతుం డగుట యజమాని యాజ్ఞ ప్రకారము చంద్రమతిని వధించుట కంగీకరించి యాలేమను వధ్యస్థానమున నిలిపి నిశిత కృపాణమును పాణిచేఁ బూని యామె శిరమును ఛ్ఛేదించుట కుద్యుక్తుం డయ్యెను ఆ కృత్యం బరసి "ఆహా! ఏమి హరిశ్చంద్రుని సత్యనిష్ఠ! దారిద్ర్య మాతని నొంపలేదు; అవమాన మాతని జయింపలేదు; మృత్యు వాతని వశపఱచుకొనలేదు; ఆపదలపై నాపదలు ప్రాపించిన కొలఁది నగ్ని తప్తమైన సువర్ణంబుభాతి యాతని సత్యనిరతి మఱి మఱి రాణించినది? సత్య హరిశ్చంద్రుఁ డను బిరుదీతనికే చెల్లు" నని బృందారకు లాతని వేనోళ్ళ గీర్తించుచు నాతనిపైఁ గుసుమ వర్షంబు గురిపించిరి. "ఇట్టి మానవోత్తముం డుదయించుటచే మా మర్త్యలోకమే మాన్యమయ్యె" నని మర్త్యులు హర్షించిరి. "ఇట్టి సూనృత వ్రతుని మోయుభాగ్యంబు గల్గె నహా! నేమి నా పుణ్య" మని వసుంధర హర్షపులకిత గాత్రియయ్యె. ఇప్పగిది నెల్లరొక్కనోరుగ హరిశ్చంద్రుని సత్యనిష్ఠను శ్లాఘించుచుండ విశ్వామిత్రుఁడు మాత్ర మెల్లూరుకొనును. అతని కాతనిపైఁ బూనిన కోపముగాని పుట్టినకోపమా? ఎట్టి యిక్కట్టు లొదవినను మొక్కవోని హరిశ్చంద్రుని సత్యదీక్ష యాతనికి మహానందమును గొల్పెను. తోడనే దృఢ వ్రతుం డగు నా రాజేంద్రుపై యాతని కపారవాత్సల్య మొదవెను. విశ్వామిత్ర

మునీంద్రుఁడు నిష్కపటి. ఒకరిపై గల్గిన శత్రుత్వమును గాని మిత్రత్వమును గాని బహిర్గతము సేయకుండ నాతఁ డొకింత తడవైనను నంతరంగమున నిముడ్చుకొన జాలఁడు. ఎప్పుఁడు హరిశ్చంద్రుని సత్యనిష్ఠ తన కామోదము గొల్పెనో నా క్షణమునసే యాతఁడు ప్రత్యక్షమై భార్య వధోద్యోగమున నున్న హరిశ్చంద్రుని చేయిఁ బట్టుకొని ఓయీ హరిశ్చంద్ర సార్వభౌమా! నీ యనుపమాన సత్యనిష్ఠకు సంతృప్తుఁడ నైతిని. నీకుఁ బ్రాప్తించిన యీ యాపత్పరంపర లెల్ల నీ నిజమరితనమును శోధించుటకై నాచేఁ గల్పింపబడినవి. 'బాలహంత్రి' యని నీచే వధింపబడ నున్న యీ నీ సాధ్వి నిరపరాధ. వధార్హ గాదు. నీ వధోద్యోగము నుపసంహరింపు మనెను. విశ్వామిత్రుఁ డిట్లు వచింప నానంద కందళిత హృదయారవిందుఁడై త్రిశంకువు "మహాత్మా! ధన్యుఁడ" నని కృపాణమును నేలవైచి యీ మునితల్లజు చరణంబులకుఁ బ్రణమిల్లెను. ఇంతలో వసిష్ఠమహర్షియు నట కరుదెంచెను. విశ్వామిత్రుఁ డాతని గని మహర్షివర్యా! నీ పంతము నెగ్గినది. ఈ సార్వభౌము నెనెన్ని విధములనో శోధించితిని. ఎంతెంత యాపదలకో పాల్పడఁ జేసితిని. ఎంత జేసినను సత్యభంగ దోషమునకుఁ బాల్పడఁడయ్యె. 'లేదు, కా' దను మాట నోట నుచ్చరింపఁడయ్యె. ఆహా! నిత్య సత్యవ్రతుఁ డను మేటి బిరుదీతనికే చెల్లు నన శ్లాఘించెను. అంత విశ్వామిత్రుఁడు హరిశ్చంద్రుని రాజముద్రిక నాతని హస్తంబుల నిడి యిఁక నుండి 'సత్యహరిశ్చంద్రుఁ' డని జగంబులు కీర్తింప జనరంజక

ముగా ధరాపాలనంబు సేయుచు ననంతర మనన్య దుర్లభం
బగు నక్షయలోక సుఖంబు లనుభవింపు మని ప్రేమ పురస్స
రంబుగా వాక్రుచ్చెను. 'మహాప్రసాద' మని విశ్వామిత్రుని
యానతిని హరిశ్చంద్రుం డంగీకరించెను. మునితల్లజు లిరువురు
తమ తమ యాశ్రమంబులకుఁ జనిరి. హరిశ్చంద్రుఁడును విశ్వా
మిత్రుని యనుగ్రహంబున పునర్జీవితుండైన తనయుని, వధ
నుండి విముక్తయైన పత్నినిఁ దోడ్కొని ప్రజలెల్ల రానంద
తరంగితాంతరంగులై స్వాగతం బీయ నయోధ్యా నగరంబున
కరుదెంచి యెప్పటి యట్లు రాజ్యపాలనము సేయుచుండెను.

---

## పదిరెండవ ప్రకరణము.

అయ్యో! ఎంత మందబుద్ధిని? ఎంత బాలిశుఁడను? అక్రమంబుగ హరిశ్చంద్రుని బాధించి యమూల్య తపఃఫలం బెల్ల వమ్ముసేసి కొంటినే! నా యవివేకంబు పేర్మి వసిష్ఠ మహర్షి యాధిక్యత మరల నొకపరి దృఢపడియె. ఆ మహాత్మునిచే మరల నే నొక మాఱోడింపఁబడితిని. లోకులకు లోకువైతిని; బృందారకులకుఁ జులకనైతిని; తపమునకుఁ గొఱడైతిని. అకటా! ఇట్టి యల్పమతిని మత్సరగ్రస్తుఁడ నగు నాకా బ్రహ్మ తనయునితోఁ దుల్యంబగు బ్రహ్మ పదం బెట్లు లభించును? అసూయ ద్వేషమును బుట్టించును; ద్వేషము వాదకారణ మగును; వాదము క్రోధమ్మునుఁ బ్రకోపింపఁ జేయును; క్రోధము స్వపరనాశనమును గుర్తింపనీయదు;

అకటకటా! హరిశ్చంద్రుఁడు సత్యనిరతుఁ డను మాటను సహింపలేకనే గదా నే నీర్ష్యాళువునై యింతపనిఁ జేసితిని. దీన నేమయ్యె? హరిశ్చంద్రుని సత్య నిరతి మఱి మఱి రాణించి జగద్వంద్యమయ్యె. నేనో నిష్ఫల యత్నుఁడనై లోకావమాన మునకు గుఱియై పూర్వార్జిత తపఃఫలంబెల్ల వమ్ముసేసి కొంటిని. ఇసీ! ఎట్టి నీచతరకృత్యము! ఇప్పగిది మాటిమాటి కీర్ష్యాక్రోధంబులకు వశ్యుఁడనై కయ్యమునకుఁ గాలుదువ్వు నేను శమదమాది సత్వసంపన్నులకుఁ బడయఁ జాలిన బ్రహ్మ పదం బెట్లు పొందనేర్తు నని నిజాశ్రమంబున కరుదెంచిన దాది విశ్వామిత్ర మునీంద్రుఁడు డెందమున కడింది విషాదము నెంది "యేమైనఁ గానిమ్మామాటిట్టి యితరేతర వ్యవహారం బులకు మనంబును జొరనీయక యేకాగ్ర చిత్తుండనై తపంబు షల్పెద" నని నిశ్చయించుకొని మరల తపంబునకుఁ గడంగెను.

బహ్మపదంబుఁ దప్ప నన్యపదంబులు తృణీకరించి శీతో ష్ణములవలన గల్గెడి కాయక్లేశంబు గణింపక సుఖదుఃఖముల లెక్కసేయక రుచ్యాహారంబులపై వాంఛనిడక సలిలమాత్రా హారుండై యేకాగ్రచిత్తంబున గాధేయుఁడు తపంబు సలుపు చుండెను. మరల సహస్రవర్షంబులు పరిపూర్ణమగుచుండె. అట్టియెడ విశ్వామిత్రుని తపంబు నిర్విఘ్నంబుగా నెఱవేఱె నేనిఁ దమ తమ దేవత్వంబు కేమి భంగంబు వాటిల్లెడునో యని శంకించి బృందారకులాతని తపంబునకు విఘాతంబు సేయ నెంచి లావణ్యవతులలో మేలుబంతియైన 'మేనక' యను నచ్చరలేమ నాతని కడకుఁ బుత్తెంచిరి. నిలింపుల పంపున

నేతెంచిన యయ్యువిదయు గాధేయుఁడు తపంబు సేసెడు కమలాకరంబుపొంతఁ కరుదెంచి తన యసమాన వయోరూప విశేషంబులు గౌశికుం డరసి మోహితుం డగునట్లు లాసరో వరంబున సవిలాసంబుగ సలిలావగాహనంబుసేయ దొడంగెను. అట్లు వినీల దీర్ఘ శిరోజంబులు విరియఁబోసికొని నిజతనూలా వణ్య ప్రభాపుంజంబులు ప్రాభాత నీరజ బంధు ప్రభాజాలం బుల వెలవెల పాఱఁజేయుచు స్నానమాడెడి యమ్మత్తకాశినిని గని బ్రాత రనుష్ఠానంబులెల్లఁ దీర్చుకొని తపస్సమాధి నిలుప నున్న విశ్వామిత్ర మునివరుఁడు మారశరాహతుఁడై "అయ్యారే! ఏమి యీ తన్వంగి లావణ్యము? జగన్మోహనమై విరాజిల్లుచున్నది. నిర్జరేంద్రునైన నెక్కటి కయ్యమున నిర్జింప నగును గాని యీ పూఁబోడి వాలుచూపుల నిర్జింప నెట్టి వీరాతి వీరునకైన సాధ్యమా! విధాతృ సృష్టికైనఁ బ్రతిసృష్టి సేయ నగునుగాని యీ యిందువదన ముఖేందు మండలమున బర్వు హావభావ కళాసృష్టికిఁ బ్రతిసృష్టి సేయ నెవని తరము? ఆహా! ఎట్టి నిర్జితేంద్రియుఁడైన తన నేత్రేంద్రియములచే నీచారు హాసిని తెలినవ్వు నిగ్గులఁదోగి, యీబింబోష్ఠి మధురా ధరమాధుర్యమాని, యీ తన్వంగి ఘుతమాలావణ్యము జవిచూచెనేని యీ కలభాషిణితోఁ భాషణంబులకు దొర కొనక యెట్లుండగలఁడు? అకటా! ఇట్టి లేమనుఁగనియు సుఖ భోగంబు లనుభవింపని పురుషుఁడు పుడమి మనియేమి? మనక యేమి? ఎన్ని బ్రహ్మర్షి పదంబులైన యీ కామినీ పరిష్వంగ సుఖంబుతోఁ దుల్యంబులగునే! ఛీ! ఏటి తపంబని విశ్వామునీం

న్నిఁడు కూర్చున్న యెడనుండి దిగ్గునలేచి యా దేవకామిని తానమాడెడి నెడకుంబోయి "యోయంగనామణీ! నిన్నుఁ గన్నదాది తపోధ్యానైకాయత్తమైయున్న మదీయ చిత్తం బయస్కాంతా కర్షితంబగు లోహంబుపగిది నీ యెడకా కర్షితంబగుచున్నది. కానవో మత్తకాశినీ! కుసుమాస్త్రుని విష మాస్త్ర పీడితహృదయుండనై యల్లాడుచున్న నన్నుఁ బరిగ్రహించి పుణ్యంబుఁ గట్టుకొమ్ము. కొమ్మా! నేనెవ్వడ నను కొంటివి? స్వర్గంబునకుఁ బ్రతిస్వర్గంబు సృష్టించి నిర్జరుల గజ గజలాడించిన మహా ప్రభావోపేతుఁడనైన విశ్వామిత్ర మునీంద్రుఁడనని ప్రగల్భంబుగాఁ బల్కెను. విశ్వామిత్రుని తపోభంగమునకే పనిఁబూని వచ్చినదిగావున మేనకయు నాతని వేఁడికోలున కంగీకరించి యాతని యుటజంబున నుండుట కొడఁబడెను.

ఇట్లు దశవర్షములు గడచె. విశ్వామిత్రునకు మేనక యందొక కొమరిత గలిగెను. ఇప్పగిది మేనకంగూడి యనంత సుఖోపలీలలఁ బ్రొద్దులు పుచ్చుచున్న చందమున గాధినంద నుఁడు వ్యవహరించుచుండ నున్నట్టుండి యొక్క నాఁడాతని చిత్తంబున నొక మహావిచారం బుదయించె "అక్కటక్కటా! ఎంతప్రమాదము వాటిల్లె! పూజ్యంబైన రాజ్యంబు విడిచి, ప్రేమ భాజనులైన సతీ సంతానంబును బరిత్యజించి నిఖిల భోగైకాస్పదంబగు గృహస్థాశ్రమంబు నుజ్జగించి జడదారినై నే వచ్చిన కర్జంబేమి? నే చేయుచున్న కృత్యంబేమి? అహాహా! ఎక్కడి బ్రహ్మత్వము! ఎక్కడి వెలవెలదుక పొత్తు! ఎక్కడి

(10)

నిశ్చల తపము! ఎక్కడి రాగభోగయుతమైన సంసార జంజాటము! అయ్యో! కనుచుండగనే పదేండ్లు గడచె! ఇంద్రియలోలుండనై కర్తవ్యంబు మఱచి యచ్చర మచ్చెకంటితగులంబున తారాడుచుంటి! అకటా! రాజునై రాజధర్మములు పాలింపక బ్రాహ్మణత్వంబునుం గోరి తపంబు సల్పుటేమి? కాంతాలోలుండ నగుటేమి? అకటకటా! ఇంతకంటె పరిహాసపాత్రంబగు విషయం బొండుగలదే! అయ్యో! ఎంతటి బుద్ధిహీనతకుం బాల్పడితిని! ఎంతటి మోసమునకు లోనైతిని! పరిపక్వహృదయుండంగా ననుటకీ నా కృత్యంబు తార్కాణగాదె! అకటా! నాయకార్య కరణంబుగని నా తపంబు వేడబంబని బాడబులు పకపక నగరే! అందఱమాట కేమి? కట్టా నాచేష్టితంబున కా వసిష్ఠమునివరుం డెంతగా హసించునోగదా! ఇటుల తన దురాచరణం బూహించిన కొలందిఁ బ్రీడాదుఃఖములు పురిగొని యుల్లంబు దల్లడవెట్ట విశ్వామిత్ర మునీంద్రుం డొకింత తడవు భ్రాన్పడినట్లుండి సర్వసంగ పరిత్యాగినగు నాకీ దేవాంగనాబంధం బెట్లుపలబ్ధమయ్యెనని యోజించి నిజతపోవిచ్ఛిత్తికై బృందారకులు పన్నిన పన్నుగడగా నెఱింగి వారి మాయావాగురులలోఁ జిక్కిన తన మనోదార్బల్యమునకుం జింతాపరీత స్వాంతుండై యవనత మస్తకుండయ్యెను.

పరేంగితజ్ఞురాలగు మేనక గాధినందనుని హృదయవేదనను నాతని ముఖవికారాదులచేతనే గ్రహించెను. గ్రహించి యాగడుసుందపసి పూర్వచేష్టితంబు లూహించి యాతనిచేఁ దనకెట్టి ఘోరశాపంబు ప్రాప్తింపనున్నదోయని భయ

విహ్వాలయై పవనాహతంబగు కుసుమవల్లరి చందమున నా కంపితాంగయై భీతహరిణి వడువున బెదరుచూపులఁ బఱచుచు నిశ్చేష్టఁజెందినట్టులై నిలిచినచోటనే నిలువఁబడెను. అంత గొంత తడవునకుఁ దలయెత్తి విశ్వామిత్ర మునివరుఁడా యప్సరస చపలాక్షిఁగని కరుణా యత్త చిత్తుఁడై "యో నిలింప కన్యకామణీ! నీవేల సాధ్వసముఁ జెందెదవు? ఇందు నీయపరాధ మిసుమంతయు లేదు. తపోధికుండనయ్యు విజితేంద్రియుఁడనుగా మింజేసి నీకులోఁబడి విస్మరిత కర్తవ్యుఁడనై కాని కార్యంబుఁ జేసితిని. నా బాలిశత్వమునకు నేనేనిందుఁడ నగుదును గాని నీవుగావు. కాన భామా! నీవింక జనుము. నా వలన నీ వెంతమాత్రము భయాతురవుగాకుము. నేను కామక్రోధంబుల జయించుటకై హిమనగంబు పొంత కరిగి తపంబు సల్పెదనని నాక్రుచ్చి తత్క్షణమే యాదివిజ కామినిఁ బాసి విశ్వామిత్రుఁడు నిజేచ్ఛం జనెను.

మేనకయు విశ్వామిత్రుని యౌదార్యంబునకు మది మెచ్చుచు నాతనివలన గలిగిన శిశువును మాలిని యను నేటి తటంబున విడిచి దివంబునకరిగెను. మేనకా విశ్వామిత్రులకుఁ గల్గిన యా బాలకయే కణ్వమునీంద్రునిచేఁ బెంపఁబడి శకుంతల యనునభిధేయంబునఁ బ్రసిద్ధయై దుష్యంత మహారాజున కిల్లాలై భరతుంగనెను.

---

# పదుమూఁడవ ప్రకరణము.

విశ్వామిత్రుఁడు తపంబునకు దొరకొని తిరిగి వేయి హాయనంబు లయ్యెను. ఆతని తపోతీక్ష్ణతకు ముజ్జగంబులు కంపించుచుండెను. నిలింపు లా తాపంబున కోపలేక హావడిఁ జెంది పరమేష్ఠి సన్నిధి కేగి "విధాతా! జగత్సృష్టి కళా పారీణా! గాధేయుని తపో తీక్ష్ణత కాఁగలే కున్నారము. ఆతనికి మహర్షి పదం బిచ్చి శాంతుఁజేయవే" యని మొఱలిడిరి. అప్పగది మొఱలిడెడి నిర్జరుల యార్తిఁ గని జాలిఁజెంది హిరణ్యగర్భుఁడు హంసవాహనా రూఢుఁడై రయంబున కౌశిక మునీంద్రుని చెంత కరుదెంచి విశ్వామిత్ర మునీంద్రా! నిరుపమానంబగు నీ తపఃప్రభావంబునకుఁ బరమహర్ష మయ్యె. కాన నీకు మహర్షి పదం బిచ్చితిని తపం బుడుగుమనెను. అనిన ధాతకు సాంజలియై విశ్వామిత్రుఁడు "దేవజ్యేష్ఠా! మహర్షి పదంబుఁ బడయుటచే నే నింద్రియ జయుండనైతినే" యని సవినయంబుగ నడిగెను. అడిగిన గాధేయునెడల దయాకలితాంతఃకరణుఁడై కమలాసనుఁడు గాధినందనా! లేదు. నీ వింకను జితేంద్రియుఁడవు కాలేదు. యత్నింపు" మని వాక్రుచ్చి చనెను.

ఈ మాఱు విశ్వామిత్రుఁడు తొల్లిటికంటె నధికంబగు నిష్ఠతోఁ దపంబు సేయ నిశ్చయించెను. వాయు వశనంబుగాఁ గొని నిర్భర నిదాఘసమయంబున జాజ్వల్యమాన శిఖిశిఖా సంఘాత మధ్యంబునను, ఘన ఘనానీక సంఘాత సంఘర్షణా

సంజాత గర్జాభయంకరంబగు ప్రావృట్కాలంబున బట్టబయలు నను, దురంతతర శీత వాతాభీమం బగు హేమంతంబున హిమపూర సలిల మధ్యంబునను నిల్చి ప్రాత స్సంధ్యలు, దివారాత్రింబు లనెడి భేదంబు లేక యొక్క మొగి విశ్వామిత్రుఁడు తపంబు సల్పుచుండెను. ఇటుల విశ్వామిత్రుఁడు తపంబుసేయ మహోగ్రంబైన యా తపోతీక్ష్ణతకు సైపలేక జగంబులు మరల సంక్షోభము నొందె. అమరులు వెఱగందిరి. అట్టి యెడ నిజసురేంద్రాధిపత్యంబున కెట్టి భంగము వాటిల్లెడినో యని భీతిల్లి యింద్రుఁడు విశ్వామిత్రుని తపంబునకు మరల విఘ్నంబు సేయ నెంచి వేల్పుటువిదలలో నగ్రగణ్యయు నగణ్య లావణ్య విలాస భాసురయు నైన రంభను రావించి యమ్మొగువ కిట్టు లనెను. "రంభ! నీ రూపం బసదృశంబు. నీ వచోనైపుణి యసమానము; నీ గాత్రమాధుర్య మమేయము. సౌందర్య విభవాభిరామలైన యప్సరాంగనల యందు మేటివి. నీ పరిరంభణ సుఖంబున కాసించిగాదే విప్రులు బహుళాధ్వరంబులు సల్పియు, క్షత్రియులు మహా భయంకరంబగు సంగ్రామ రంగంబుల నసువులు బాసియు స్వర్గగమనంబు సేయుట! నీ సౌందర్య చాతుర్యంబులకు మోహితుండై గాదే కౌబేరుండు నీ యింటి బానిసీఁడై నిన్ననిశం బెడబాయక సేవించుచుండెను. లేమా! వేయి మాటలేల? ఎట్టి విజితేంద్రియులైన నీచేఁ జితులు. ఎట్టి యోగిపుంగవులేని నీచే వంచితులు. ఎట్టి భక్తశిఖామణులేని నీచేఁ బరాభూతులు. ఎట్టి గడుసుతాపసులేని నీ వలపుచూపులకు బద్ధులు. నిజ తపో

బలంబున నమరేంద్రత్వంబుఁ బడయుగోరు దైత్య దానవ తాపసానీకంబుల తపంబులు విఘ్నపఱచి సురలకు నీవు చేసిన మేలింతంతనరానిది. అట్టి నెఱజాణ వగు నీ విప్పట్టున నీ జాణతనమును మరల నొకపరి చూపు సమయ మాసన్నమైనది. మహర్షి యగు విశ్వామిత్రుఁడు దురుతరతపంబు సల్పుచున్నాఁడు. మహోగ్రంబైన యాతని తపంబు లోకంబుల నాకులపెట్టుచున్నది. ఆతని తపోవిజృంభణంబు మాన్పకున్న లోకంబులు దగ్ధంబులగును. లోకపాలురమైన మే మీ సమయంబున నుపేక్షించితిమేని మన విబుధానీకంబులు ప్రాభవశూన్యంబులై రూపడఁగును. జగంబుల కుపద్రవంబు వాటిల్లును. కాన లోకహితంబును, దేవహితంబును నైన నిమ్మహాకార్యంబు నీవు నెఱవేర్పఁగలయును. కాన యో విలాసవతీ! నీ వెవ్విధినైన నా విశ్వామిత్రుని పాలికిం జని యాతని తపంబు చెఱచి జగదుపద్రవంబు వారింపుము. దేవతలకు హిత బు సల్పుము. జగన్నుతకీర్తిఁబడయుము." కార్యార్థియై యింద్రుఁ డిప్పగిది నొప్పిదంబు గాఁబల్క వాతాహతంబైన వల్లరివిధంబున గడ గడ వడఁకుచు సాంజలియై రంభ యా జంభారిం గని దేవా! నాపై నిటుల దయతప్పితేల? ఆ విశ్వామిత్రమహర్షి సహజముగనే కడు భయంకరుఁడు; మూర్ఖుఁడు; ముక్కోపి. ఇప్పుడో యింద్రియజయాభిలాషియై మహోగ్ర తపంబు సల్పుచున్నవాఁడు. కాన కోపశీలుఁడైన యా తాపసి కడ కీసమయంబున రసిక జనమనోభిరామమైన రామలేగఁ దలంచుట కొఱవితోఁ దలఁగోకికొనుట గాదే; అమరేంద్రా! ఆతని స్మరణ మాత్రంబుననే నా హృద

యముకంపించుచున్నది; మేను వణఁకుచున్నది. నిజపుత్రులనే శాపోపహతులను గావించిన నిష్ఠురచిత్తుఁడా జడదారి. అట్టి యాతఁడు తనతపంబునకు విఘ్నంబు సేయనెంచిన నాబోటి స్త్రీల మీఁద సదయుండగునే? కావున నో నిర్జరనాథా! నీ వెట్టి నిష్ఠురకృత్యంబు సేయ నియోగించినను జేతును గాని యా ముష్కర తాపసి కడకు మాత్రము నన్నంపకు" మని దీనంబుగా వేఁడికొనెను. భయార్తయై రంభ యివ్విధంబుగాఁ బ్రార్థింప స్మితాననుండై శచీపతి "రంభ! ఏల యీ లీల యెన్నఁడెఱుఁగని పిఱికితనముఁ జూపుచున్నావు? ఆ విశ్వామిత్రుఁ డెట్టి యుగ్రతపశ్శాలియైన నగుఁగాక మన మేనకకు వశుఁడైన మేటితాపసియే గదా? దశాబ్దంబులు మన మేనకతో సుఖోపలీలలఁ బ్రొద్దుపుచ్చిన యీ రాచతాపసి కింత వెఱవ వలెనే? నీవు మేనక కన్న మిన్నయైన సౌందర్యవతివి. నీవే యాతని సమక్షంబున కరిగినచో నిన్నుఁ గని యాతఁడు మిన్నకుండఁ గలఁడే? ఆతఁడే యంతటి నిశ్చల చిత్తుఁడైనచో నిన్నిమాఱులేల తపోభంగము పాలగును? కాన రంభ! ఆ విశ్వామిత్రుని వలని భయంబు వీడుము. రమ్మీ. నీ చక్కఁదనం బింతకంటె పెంపెక్కునటుల వరంబొసంగెదను. ఏను గూడ మారునితోఁ గూడి పికంబునై నిన్ననుసరించెదను. సుఖశీతలమందగమనుండై పవమానుండును నీకుఁ దోడగును. నవపల్లవకుసుమకోరకవిరాజితంబైన యామనియు నీకు సహాయమగును. ఇక నీ విశ్వామిత్రుని చలితేంద్రియునిగాఁ జేయుటేమి దుర్లభము? రమ్మీ! నిర్భీతవై" రమ్మనెను. పురం

దరుఁడిట్లు ఘనంబుగాఁ బ్రశంసించి యాహ్వానింప రంభ గరువంబుఁ జెంది భయంబుఁ బాసి గాధేయు తపంబుఁ జెఱుప నంగీకరించెను. రంభ నిట్లు లోఁడఁబఱచి యింద్రుఁడిఁక గాధేయు తపము భగ్నమైనటులే యని యానందంబు నొందెను.

అంత జంభారిం వీడ్కొని రంభ నిజాలయంబున కరిగి కౌశికమునీంద్రతపోనిర్మూలనా కుతూహలాయత్తచిత్తయై యమూల్య వస్త్రాభరణంబులు గైసేసికొని ఘనసార చందనాది పరిమళ లేపనంబులు మెయిఁబూఁతఁబూసికొని మనోజ్ఞ సౌరభ రమణీయంబు లగు దేవతాసుమంబులు వేణిందుఱుముకొని వల్లకీ కీలిత కరాబ్జయై యింద్ర పద్యమ్ములు శుకశారికలై తోడురా యల్ల నల్లన గాధేయ నాశ్రమోపవనంబుఁ బ్రవేశించి స్మితాననయై క్రీగంట నత్తపోధను విలోకించుచు నొక్క మనోహర గీతంబు గానంబు చేసెను. అమ్మనోజ్ఞ మంజులరవంబు శ్రవణ గోచరంబైనంతనే విశ్వామిత్రుఁ "డహో! ఎచ్చటనో మనోజ్ఞ వీణా నినదంబు కోమలీకోమలగాత్రమేళనంబున సుధామధుర తుల్యంబై శ్రవణపేయంబుగా వినవచ్చుచున్నది. నారీ సంచారములేని నా యాశ్రమంబున స్త్రీ కంఠస్వనము వినవచ్చుటేమి?" యని యక్కజంబంది కన్గవవిచ్చి దెసలు పరికింప రంభ దృగ్గోచర మయ్యెను. అయినను, నప్పటి యా దేవకామిని యాకృతి మనోమోహనంబై కరంబాకర్షణీయముగా నున్నను, చలితేంద్రియుఁడును, వీతస్థైర్యుండును గాక విశ్వామిత్రుఁ డా యప్సరాంగన యట కరుదెంచుటకుఁ గతం

బేమి యని మనంబున నించుక యోజించి నిజతపోవిఘ్న కుతూహలమతియై దేవేంద్రుఁడు పన్నిన పన్నుగడగా నెఱింగి కోపించి క్రోధతామ్రాక్షుండై రంభ దెస చుఱచుఱఁ జూచుచు, ఓసీ! రంభ! ఏమి నీ సాహసము! కామక్రోధంబుల జయింప నెంచి నిష్ఠుర తపంబు సల్పెడు నన్ను వంచింపనెంచి యరుదెంచితివా? నీ కపట నటనంబులు నా తపో గరిమంబుఁ జెఱుపఁ జాలవు పొమ్ము. నీ యకృత్యంబునకు ఫలంబుగా దశ సహస్రవర్షంబులు చేతనారహితం బగు కఠిన పాషాణంబవై ధరంబడి యుండు మని శపించెను తోడనే సుకుమార సుందర తన్వంగి యగు నా రంభ నిజతనూవిభవంబెల్లఁ గోల్పోయి కఠినశిలయై ధరం గూలెను. రంభ పాటుఁగని భయంబుఁ జెంది జంభారి కందర్ప ద్వితీయుండై పలాయనుఁ డయ్యెను

రంభకు వశుఁడు గాకపోయినను క్రోధంబు పెంపున నమ్ముగువను రూపుసెడ శపించుటఁ జేసి విశ్వామిత్రుని తపంబు మరల వ్యర్థమయ్యెను. కామంబు జయించినను, దుర్జయంబైన క్రోధంబు తన్నుఁ బాయ లేదనియు రంభను శపించుట తన తాల్మిలేమికి నిదర్శనంబనియు విశ్వామిత్రుఁడు గ్రహించెను. "కట్టా! బహిశ్శత్రువుల నంగబలముననో నర్థబలంబుననో నిర్జించుట శక్యంబగునుగాని యంతశ్శత్రువుల జయించుట దుస్తరము. కామముకంటె నజేయమైనది క్రోధము! క్రోధము నిశ్శేషముగా నశించినగాని బ్రహ్మత్వంబు బడయరాదు." కాన నీ మాఱు క్రోధంబు జయించుటకై తపంబు సల్పెదనని నిశ్చయించి తన తపోవిఘ్నకారణంబైన యుదీచ్యదిశను వీడి

ప్రాచ్యదిశ కరుదెంచి వాగ్నియతినిఁగాని యాగ్రహంబు నిగ్రహింప సాధ్యంబుగాదని నిశ్చయించి మౌననియతుండై తపంబుసేయ సంకల్పించెను.

---

## పదునాల్గవ ప్రకరణము.

సకల సుగుణ సముదాయంబులో శాంతగుణం బసదృశంబు. ఎవనిమనంబు శాంతమునకు దావలముగాదో యట్టి వాఁడెట్టి నిష్ఠుర తపంబు సల్పియు మనోరథ సిద్ధిఁ బడయఁజాలఁడు. కాన నట్టి శాంతగుణము నాయందు కొఱవడుటఁ జేసియే నా తపంబున కిన్ని యంతరాయంబులు ఘటిల్లుచున్నవి. ఇన్ని యుపద్రవంబులు తటస్థించుచున్నవి. కాన నిఁక నెట్టి ఘనతర సందర్భములు ఘటిల్లినను మనంబుననైన నించుకేని కోపంబుఁబూనను. క్షమను బాయను. మౌనంబు వీడను. అంతకును స్వాంతంబు క్రోధవర్జితంబుగా దేని నిటుప్రాసంబుల శరీరంబును గార్శ్యమొందింతును. నిరాలాపంబుల వాక్కును బంధింతును. నిమీలితనేత్రంబుల నాలోకనంబు లరికట్టుదును. శబ్దనిషేధంబుచే శ్రోత్రంబులనియంత్రింతును. ఇప్పగిది నింద్రియంబులనెల్ల నుగ్రిక్కించి త్రొక్కినను మొక్కినను నొక్క చందంబున సమత్వంబు వహింతును. ఇట్టి జితేంద్రియత్వంబును సమభావంబును బట్టువడు దనుక గాలినైన గొనను. మఱియు మహోగ్రాగ్రిశీ విషతుల్యంబగు నా క్రోధంబును జయించువఱకు వేవేల సమలైనను. తపంబు మానను; ఇట్లు

కృతనిశ్చయుండై విశ్వామిత్రుఁడు మౌననియతిఁబూని తపం
బునకుఁ గడంగెను. ఘోరంబగు నిట్టి తపంబున గాధిజుని మేను
కడుంగడు శుష్కించెను. కాని యాతఁడు తపంబుమానలేదు.
మహోగ్రంబైన యాతపంబుఁ జెఱుప దేవేంద్రాది దేవత
లెల్లరెన్నెన్నో వన్నకంబులు వన్నిరి. కాని విశ్వామిత్రుఁడీ
మాఱు సురల వాగురులఁ జిక్కుకొనలేదు. వారియెడ నాగ్ర
హంబునైనఁ జెందలేదు. వారిచేఁతకు బ్రతిచేఁత చేయవలయు
ననెడు తలంపునైన తలంచలేదు. ఇట్లు శమదమాది సత్వ
సంపత్తినిఁబడసి స్థితప్రజ్ఞుండై వేయి హాయనంబులు నిడించెను.
ఇప్పగిది నిరంతరాయంబుగా తపంబు పూర్ణంబుగావించి విశ్వా
మిత్రుఁడు భుజింపఁ జనుచుండ యింద్రుఁడాతని క్షాంతి నింకను
బరీక్షింపఁగోరి విప్రరూపంబున నరుదెంచి తాపసోత్తమా!
బుభుక్షాపీడితుండనై యల్లాడుచున్నవాఁడ నన్నంబుఁ బెట్టవే!
యని యర్థించెను. ఆతఁడు కపటభూసురుండని యెఱింగియు
నాతనియెడ కోపంబుఁ బూనక విశ్వామిత్రుఁడు తాఁ గుడువఁ
బోయెడి యన్నంబా విప్రునకిడి మరలఁ దపంబునకుఁ జనెను.
అట్టి క్షుదాతుర సమయంబున గూడ విశ్వామిత్రుఁడు చూపిన
నిగ్రహంబును గని "కౌశిక మునీంద్రు నిఁక భంగపుచ్చుట
దుర్లభంబని సురలు హతాశులైరి. తిరిగి సహస్రవర్షంబులు
పరిపూర్ణంబైన యా విశ్వామిత్రుని తపోవిశేషంబునకు దిశలు
కలంగె! కులనగంబులు చలించె! సప్తసాగరంబులు సలసల
మఱిఁగిపొంగె! పుడమి కంపించె! భయంకర మారుతంబులు
వీఁచె! దినమణి నైజతేజుఁబాసి నిష్ప్రభుండయ్యె! దేవగో

బ్రాహ్మణ పూజనంబులు కట్టువడియె! స్వర్గ మర్త్య పాతాళ వాసంబులైన సమస్తప్రాణి చయంబులు ప్రాణోత్క్రమణా భీతంబులై యల్లాడ దొడంగె! ఇవ్విధంబున లోకంబులు స్వాస్థ్యంబుచెడి కష్టింబడ సైపలేక సురగరుడ గంధర్వ యక్ష కిన్నెర కింపురుషాది దేవతానీకంబులెల్ల దేవేంద్రుని ముందిడుకొని దేవజ్యేష్ఠుని పాలికింజని ఓ లోకేశా! జగత్సృష్టి కారణభూతా! విశ్వామిత్రుని మహోగ్రతపంబు వేండ్రంబై లోకంబుల నాకులంబెట్టుచున్నది. అత్తపోధను తపోతీక్ష్ణత కోపలేక జగంబులెట్లు సంక్షోభంబుం జెందుచున్నవో కనుము! దేవా! అమ్మహాత్ముని తపంబుం జెఱుప నెన్ని విధంబులనైన యత్నించితిమి. ఎన్ని పనులైనం జేసితిమి. కాని కామ క్రోధంబుల కాతఁడు వశుఁడుగాలేడు. కమలాసనా! పుటము వెట్టిన బంగారు చందమున నేడు విశ్వామిత్రుని చిత్తం బత్యంత నిర్మలంబై విరాజిల్లుచున్నది. ఇంక నాతని నింద్రియ లోలుపుం గావించు టసాధ్యంబు. బహిరంతర నిగ్రహయుండగు నమ్మహాత్మునింక యభీష్టపదం బొసంగుట చేఁ దక్క నితరోపాయంబుల తపంబు విరమింపఁజేయ శక్యంబుగాదు. కావుననో వాణీశా! దేవేంద్ర పదంబేని లేక నీదేవజ్యేష్ఠ పదంబేని నొసంగి యా మునితల్లజు తపో విశ్రాంతుం జేయవే” యని ప్రార్థించిరి. ఇటుల బృందారక సందోహంబు లత్యంతార్తి జెందివేడికొన లోకరక్షాతత్పరుండై హిరణ్య గర్భుండమర సహితుండై విశ్వామిత్రుని చెంత కరుదెంచి “ఓయీ కౌశిక మునీంద్రా! నీ తపోగరిమంబునకు మెచ్చువచ్చె. నిరుపమతపః

ప్రభావంబున లాతిదుర్లభంబు "బ్రహ్మత్వంబు బడసితివి లెమ్ము. చిరంజీవివై సుఖంబున నుండుముని వాత్సల్య పురస్సరంబుగాఁబల్కెను. మహదానంద దాయకంబులగు నవ్వాక్యంబులాలించి ప్రమోదభరితుండై విశ్వామిత్రుఁడు నయనంబులు విచ్చి యమరగణ పరివృతుండగు పరమేష్ఠిఁగని యాతని చరణంబులకుఁ బ్రణమిల్లి లేచి లోకేశా! అస్మచ్చిరతారాభీష్ట బ్రహ్మపదంబు ప్రసాదించుటచే ధన్యుండనైతిని. కాని యొక్క మనవి. నిఖిల నిగమకోవిదులగు బ్రహ్మక్షత్రియులలో వసిష్ఠమునీంద్రుఁ డగ్రగణ్యుండు. ఆతఁడు నా బ్రహ్మత్వం బంగీకరించి "బ్రహ్మర్షి"యని పిలువవలయును. అమ్మహాత్ముఁ డటులగావించెనేని యస్మత్తపం బుడుగుదునని. గాధేయుని కోరికఁదీర్చుటకు బ్రహ్మ వసిష్ఠమహర్షి నాహ్వానించెను. ఎప్పుడు కౌశికుఁడు బహిరింద్రియముల నిగ్రహించి యంతరింద్రియముల స్వాధీన పఱచుకొనెనో యప్పుడే యాతఁడు విశ్వమిత్రుఁడై పోయెను. బ్రహ్మత్వంబు బడసెను. ఇఁక నాతనికి శత్రు మిత్ర భేదమేమున్నది? ఎల్లరాతనికి హితులే! తోడనే పూర్వవైరంబెల్ల వీడి వసిష్ఠమహర్షి విశ్వామిత్రుని చెంత కరుదెంచి "బ్రహ్మర్షి విశ్వామిత్రా!" యని మహాస్నేహభావంబున నాతని నాలింగనము జేసికొనెను. దేవతలాతనికి జేజేలు వెట్టిరి. 'జయము' జయము. విశ్వామిత్ర బ్రహ్మర్షికి జయమని నిఖిల జగంబు లాతని యింద్రియ జయంబును గీర్తించెను. ప్రణవంబును, ద్విజదుపులును వషట్కారంబును నాదియగు బ్రాహ్మణార్హక్రియా కలాపంబెల్లఁ దమ

కుఁడామై యాతని వరించెను. ఇవ్విధంబున నిజతపోబల సామర్థ్యంబున చిరతరాభీష్ట బ్రహ్మత్వంబు బడసి విశ్వామిత్ర మునీంద్రుఁడు హర్షవారాశి నోలలాడెను.

---

## పదునైదవ ప్రకరణము

విశ్వామిత్రుఁడు రాజకుమారుఁడు కావున మొదటి నుండియు విలువిద్యయందుపరినిష్ఠితఁ పండితుఁడై యుండెను. మఱియు మున్నొకప్పుడు తాను రాజుగానున్న తఱి బృశాశ్వుఁడను ప్రజాపతియొద్ద బడసిన యస్త్రములవలనను, వసిష్ఠుని జయించుటకై హరునిఁ బ్రార్థించి పొందిన దివ్యాస్త్రముల వలననుగూడ నపారధనుర్వేద మాతని కైవసమైయుండెను. కాని సర్వసంగ పరిత్యాగియగు కౌశిక మునీంద్రున కిఁక ధనుర్వేదముతోఁ బనియేమి? కాని మహనీయంబగు నావిద్య తనకడ నిరుపయోగంబుగా నంతరించుటయు విశ్వామిత్రునకు సమ్మతముగాకుండెను. అటులని యేయసమర్థునకో నా మహనీయవిద్య నొసంగుటకును నాతని చిత్తమంగీకరింపకుండెను. కాన తనకడ ధనుర్వేదంబుఁబడసి దానిని లోకకల్యాణమునకు వినియోగింపఁగల శిష్యోత్తమునికై విశ్వామిత్రుఁడు నిరీక్షించుచుండెను. ఇట్లు బహుకాలము ప్రతీక్షింప సూర్యకుల దీపకుండైన దశరథ మహారాజునకు రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులనెడి నలువురు కుమారు లుదయించి రనియు, వారిలో జ్యేష్ఠుండైన శ్రీరామచంద్రుఁడు సుగుణములకు

ఏ మహార్థంబును గోరి యిందరు దెంచితిరి? భవదభీష్టం బెట్టి బెట్టి దంబైనను శిరసావహించి నిర్వహించెదనని వాక్రుచ్చెను. మహారాజైన దశరథుండిట్లు గౌరవ పురస్సరంబుగాఁబల్కా వార్షించుచు గౌశిక మునీంద్రుఁడు "రాజేంద్రా! సత్యదాన దయాశౌచంబులకు మీ రఘువంశదీపకు లగ్రగణ్యులుగారే? మీ కులగౌరవంబునకు దగినట్లుగా నా కామితంబుఁ దీర్చెద నంటివి? నా కెంతయు సంతసంబయ్యె. ఇఁక నా వాంఛితం బెటి గించెదవినుము. రాజోత్తమా! నే నొక మహాధ్వరంబు సేయ దీక్షవహించితిని, కాని తాటకానందనులైన మారీచ సుబాహులనియెడి రక్కసుల మూలమున నా యజ్ఞంబు నిర్విఘ్నంబుగా నెఱవేఱెడి యాసగాన్పింపకున్నది. దుర్మార్గులైన యా నిశాట సోదరులు హోమకుండంబుల నెత్తురు పలలంబులు కుమ్మరించియు, హవిర్పాత్రంబుల మూత్ర పురీషంబులు విడిచియు, సతస్యులగు మానిసత్తముల మొత్తియు, యజ్ఞంబులు విధ్వంసంబు చేయుచున్నారు. ఎందరో ఋషివరుల యధ్వరంబు లిప్పగిది నా నీచులచే భంగంబు చేయబడినవి. ఆ రాత్రించరుల మూలమున మా తాపసులొందెడి బన్నంబు లిన్నియన్నిగావు. రాజేంద్రా! నాతపః ప్రభావంబున నా దుష్ట నిశాటుల నంత మొందించుట దుర్లభంబుగాకున్నను యజ్ఞదీక్షితుండ నగుట నే నయ్యాశరులపైఁ గినియుటకు నైతిగాకున్నది. కాన నా యజ్ఞంబు జరిగెడి సప్తాహంబులు నా రాక్షాసులచే నస్మదీయాధ్వరంబు భంగంబు నొందకుండ గాపాడ గల సమర్థులగు యాగరక్షకులు గావలయును. రాజా; ఈ

ప్రయోజనంబుఁ గోరి యే నీపాలి కరుదెంచితిని. కాన యుష్మత్తనయుఁడగు శ్రీరామ చంద్రుని నా వెంటఁ బుత్తెంచెదేని నిస్తుల విక్రమోపేతుండగు నాతని సహాయమున మదీయ యజనం బనిరోధకంబుగా సమాప్తి నొందించుకొని మరల నాతని నీ కొప్పగించెదను." విశ్వామిత్రుఁ డిటులఁ బలుక నాకస్మికంబుగాఁ గశాఘాతంబుఁ దిన్నలేడి వడువున నదరిపడి దశరథుండు వడవడ వడంకుచు "మునీంద్ర చంద్రమా! నా రాముఁడు గిల్లిన పాలుగాఱెడి పసిబాలుడు. అకృతహస్తుఁడు. తల్లిచేయి వెన్నున నుండినగాని రేలుపన్నుండఁడు. ఆతనికి సంగడీండ్రతో నాడెడి యీడుగాని రాకాసులతోఁ బోరాడెడి వయస్సుగాదు అట్టివానిని సర్వశక్తి పరాక్రమోపేతులును, మాయామయులును నగు నాతాటకా నందనులతోఁ బోరాడ నెట్లు పంపుదును? తాపసోత్తమా! నాకీ నందనులు ముదిమినఁ బుట్టినవారు. అందును జ్యేష్ఠుండగు రాముండనిన నాకెనలేని కూరిమి. అట్టి వానిని దుష్టనిశాటులతోఁ బోరఁబంపి నే నెట్లు సైరింతును? కానఁ దపోనిధీ! నా మనవి వినుము. నాకనేకాక్షౌహిణులబలంబు గలదు. నేనో బహు సంగ్రామంబులఁ బోరిన పోటుబంటను. మున్ను దేవాసుర యుద్ధంబున దేవతలకు సాహాయ్యంబుగాఁ జని పెక్కండ్రు రాక్షస వీరుల నుక్కడించి యమరులచే మెప్పుగనిన వాడ. కాన భవదీయాహవ రక్షణార్థం బేను చతురంగ బలోపేతుండనై యరుదెంచెదను. శరశరాసన ధారినై యహర్నిశ లేమఱక యాగవేదిం గాంచెదను. తాపసోత్తమా! దయచేసి నా రాక కనుమతింపుము.

దయాకలితాంతఃకరణుండవై శ్రీరాముని విడిచిపుచ్చు మని దీనంబుగా నశ్రుపూర్ణలోచనుండై పలికెను. దశరథుం డిట్లు వేడ నాగ్రహంబుం జెంది కోపలిస్ఫారిత నయనుండై విశ్వామిత్రుండు కోసలేశునిం గని రాజా! ఇంత యాడితప్పెదు బేలవు నా యభీష్ట మీడేర్చెద నని యేల యంటివి? నీ మూలమున నినవంశ దీపకు లాడిదప్ప రను చిరయశము నాశమయ్యె, సత్యమునకై సర్వస్వ మర్పించిన హరిశ్చంద్ర సార్వభౌముని కీర్తి నీవలన కలుషితంబయ్యె. ఛీ యింక నేం బోయెదను. ఇటులనే లోకదూషిత మతివై యనృతంబు లాడుచుం గొమరులతో సుఖించు మని పరుషంబుగాం బల్కి యాసనంబు నుండి చివాలున లేచెను. నిశాచరుల నెదిరింప బ్రియనందను నంపంజాలకయు, తపసి కోరంగిన వాగ్దానము వమ్ముసేయ నేరకయు, వ్యాకుల మతియై దశరథుండు చింతించుచుండె. అట్టియెడ వసిష్ఠుండు నిజాసనంబునుండి దిగ్గున లేచి గమనోన్ముఖుండైన విశ్వామిత్రునిం జేయిం బట్టుకొని నిలుపుచు దశరథుని గని, "రాజోత్తమా! ఈ మౌనికుంజరుండు మహాప్రభావశాలి. ఇతండు రక్షకుడై యుండ సురాసురులలో నేరును శ్రీరామచంద్రునిం జెనకం జాలరు. రూపెత్తిన ధర్మమును, పుంజీభవించిన పరాక్రమంబును, నమలమనీషియునైన నీ తపోధనునకు దేవదానవ మానవానీక మెఱుంగం జాలని మహాస్త్రంబు లనేకములు వశీకృతమై యున్నవి. మున్నొకప్పుడు భృశాశ్వుం డను ప్రజాపతి దక్ష తనయులైన జయ, సుప్రభలను వారల నిరువురం బరిణయమై వారిలో నొక్కొరియం

దేవగురు తనయులను బడసె. వార లెల్లరును దుర్ధర్ష బలురును, నతులిత సత్త్వవంతులును నైన యస్త్రంబులైరి. భృశాశ్వుఁ బ్రార్థించి ధరణినేలు కాలంబున నీత డా యస్త్రంబులెల్ల నాతనివలన బడసియుండె. మఱియు నన్ను గెలుచు వేడుక హరునిఁ బ్రార్థించి యాతని వలన ననేక దివ్యాస్త్రంబులఁ బడసె. అంతియే గాక నవ నవముగ నెన్నెన్నొ మహానీయాస్త్రంబుల సృష్టింపఁగల చతురమతి యీతఁడు. కాన రాజేంద్రా! తన జన్మంబు నిర్విఘ్నంబుగా నెఱవేర్చుకొను నేర్పు చాలక నీ మహర్షి సత్తముఁడు నీ కొమారుని సాయముఁ గోరె నని భావింపకుము. యజ్ఞరక్షణా వ్యాజంబున నవ్యాజ వాత్సల్యంబుతో నుమ్మత్తనయున కెన్నేని శుభంబులఁ గూర్ప నీ మహనీయుం డరుదెంచి యున్నవాఁడు. కావున శ్రీరామునకు రాక్షసుల వలన భయంబులేదు. మహాప్రభావ సంపన్నుఁడగు విశ్వామిత్రుని రక్షణంబున నున్న రామచంద్రుఁడు జనని పొదిగిటనున్నటుల సురక్షితుఁడు. కాన లక్ష్మణ సమేతంబుగ శ్రీరాముని యీ సంయమివర్యుని వెంట నంపుము. "దశరథ మహారాజు నిత్య సత్య వ్రతుం డనియు, ధర్మ రతుం డనియు, జగత్ప్రసిద్ధంబైన నీ యశంబును నిలుపు" కొమ్మని వాక్రుచ్చెను. కులగురుండైన వసిష్ఠమహర్షి యిట్లు హితంబు మీఱ బలుక దశరథుండు దిగులు దీఱి దుఃఖంబు బాసి తన యపరాధంబు క్షమింప విశ్వామిత్రునిఁ బ్రార్థించి రామలక్ష్మణుల రావించి దీవించి యా మునితల్లజున కొప్పగించెను. మహారాజైన దశరథేశ్వరుం డిట్లు వసిష్ఠమహర్షి యనుమతంబున

రామలక్ష్మణుల నొసంగ నానందంబుఁ జెంది విశ్వామిత్రుఁడు దశరథుని శ్లాఘించి, రామలక్ష్మణులకు భయంబులే దని నచ్చఁజెప్పి చిఱుతకోదండంబులు కరంబులనలర బాలార్క ప్రభలవెలుఁగు నా రాజనందనులఁ దోడ్కొని వెడలెను.

ఇట్లు రామలక్ష్మణులను వెంటఁగొని చనుచు విశ్వామిత్రుఁడు సాయాహ్న వేళకు సరయూనది తీరంబునకుఁ జేరెను. అంతట గాధేయుఁడు శ్రీరాముని గని రామా! నీకు బలాతిబల లనెడి మంత్రంబు లుపదేశించెదను. ఈ మంత్రంబులు మహాప్రభావోపేతంబులు. కౌసల్యానందనా! నీవీ మంత్రంబులు పరిగ్రహించితివేని త్రోవ నడిచెడి వేళ క్షుత్పిపాసలు నిన్నుఁ బీడింపవు. శ్రమంబు పుట్టదు. ఉదార సహస విక్రమ విశేషంబుల నసదృశుండ వయ్యెదవు. సుప్తుండవై యున్నను, ప్రమత్తుండవై యున్నను దానవులు నిన్నుఁ బొరిపుచ్చఁ జాలరు. మఱియు పితామహ పుత్రికలైన యీ జ్ఞాన మాతృకల శ్రద్ధాభక్తి యుక్తుండవై యుపాసించితివేని నీ ధైర్య స్థైర్య వివేక విక్రమ యుక్తి మనీషాసంపద లధికంబులగును. కాన ననుజ సహితుండవై సరయూనదీ జలంబుల శుచివై రమ్మని యానతిచ్చెను. కౌశికుం డానతిచ్చిన తెఱంగున రాముఁడు తక్షణమే లక్ష్మణ సహితుండై సరయూనదిలో శుచియై వచ్చెను. కౌశికుం డాతనికి బలాతిబల లనెడి మంత్రంబు లుపదేశించెను. దివ్యంబులైన యీ మంత్రంబులు బరిగ్రహించి రాముఁడు విశ్వామిత్రు ననుమతంబున వానిని లక్ష్మణున కుపదేశించెను. ఇట్లు ముని వరదత్త

మంత్రంబులు పరిగ్రహించి దాశరథులా ప్రథమరాత్రి ముని తల్లజునితో నా సరయూ తీరంబున విశ్రమించిరి.

అంత వేకువను విశ్వామిత్రుఁడు లేచి దాశరథుల నిద్రా ప్రబోధితుం గావించి కాల్యంబులఁ దీర్చుకొన నియమించి మరల పయనంబు సాగించెను. ఇటులు రాఘవులఁ దోడ్కొని పోవుచు గాధేయుఁ డా రాజనందనులకు పథశ్రమం బెఱుక పడకుండ మార్గమధ్యమున గాన్పించెడి శైలారణ్య పట్టణ గ్రామ నదీ నదాశ్రమ వృత్తాంతంబులు కథలు సెప్పుచుండెను. అందందు భయభక్తి తత్పరులై యాశ్రమ వాసులర్పించెడి యాతిథేయంబుల వారి క్షుత్పిపాసల నివారణంబు గావించుచు నస్తమయంబైనచోట విశ్రమించుచు నవపల్లవ తృణాకల్పితం బగు శయ్యల నా రాకుమారుల మాపులు నిద్రలు పుచ్చుచు తేపకడ లేపుచు మరల నడిపించుచు కౌశికుఁడు మహా వాత్సల్యమున వారినిఁ దోడ్కొని చనుచుండెను. మహనీయుం డగు నా విశ్వామిత్ర మునివరుఁడు తమ యెడఁ జూపుచున్న యపూర్వ ప్రేమచేతను చెప్పుచున్న రమణీయ కథలచేతను పథశ్రమంబు మఱచి యొంటరి తనపు భీతిని వీడి సుకుమారు లగు నా రా కుమారులు తమ గృహారామంబున నేస్తకాండ్రతో విహరించెడి తెఱంగున నా యుగ్రాటవులతో నా మునికుంజరు వెంటనంటి మహోల్లాసంబునఁ జనుచుండిరి.

ఇట్లు చని చని మూఁడవనాఁడు గంగాతరంగిణి దాటి తాటకావనంబు ప్రవేశించిరి. నిర్జనంబును నిఖిలక్రూరసత్త్వ విహార భయదంబును నగు నా యరణ్యంబుఁ గాంచి యాశ్చర్యంబుఁ

జెందు రాముఁడు "మహాత్మా! ఇది యేమి? ఈ కాననం బింత భీతావహంబుగ నున్న దేమి? మన మిప్పటి కెన్నియో యడవుల దాటి వచ్చితిమి గాని యవేవియు నింత భయంకరంబుగ లేవే?" యని యడిగెను. అడిగిన విశ్వామిత్రుఁడు ప్రేమతరంగితావలోకనంబుల రామచంద్రునిఁ గనుచు దాశరథీ! ఇందు పదివేల గజంబుల బలంబు గల తాటక యను రాక్షసాంగన వసించుచున్నది. సాధుజన పీడాసక్తులును, యజ్ఞవిఘ్న కరులును నైన మారీచ సుబాహు లీ రక్కసి తనయులే. రామా! ఈ తాటక యక్షకామిని. సుకేతుఁ డను యక్షునకు బ్రహ్మవరంబున బుట్టినది. నిజబలాతిరేకంబున యీ రక్కసి యొక్కనాఁ డొక్క తాపసోత్తముని గ్రసింప దొరకొన నాగ్రహించి యా మునివరుఁడు "తపస్సమాధి నున్న నన్ను కారణంబుగ కబళింపఁ దలపడితివి గాన నేఁ డాది మానుషాది నివై వికృతాకారంబునఁ గ్రుమ్మరు" మని శపించెను. నాఁట గోలె యీ యక్షతరుణి రక్కసి యయ్యె. దీని సంచారంబునఁ జేసి యేపాడిపంటలఁ బొల్పారు జనపదంబుల నొప్పెడి మలద కరూశ దేశంబెల్లఁ నిప్పగిది నిర్జనంబైన భీకరారణ్య మయ్యె. రామచంద్ర! దీని పెనిమిటియైన సుందుఁడు గూడ నిట్టులనే ప్రజల హింసించుచుండ మహర్షి సత్తముఁడై యగస్త్యుఁ డాతని గీటడఁగించెను. కౌసల్యానందనా! నీ విప్పు డీ రక్కసి నుక్కడఁపవలయును. "ఇది స్త్రీ, దీనిని జంపుట పాడిగా" దని శంకింపకుము. లోకహితంబునకై భూపాలు రధర్మ రతులైన స్త్రీలఁ బొలియించినను బాపంబు లేదు. కాన, జగత్కం

టక యైన యీ రక్కసిని సంహరించి కీర్తి వంతుఁడ వగు” మని హెచ్చరించెను. విశ్వామిత్రుఁ డిట్లు వచింప “మునివరుఁ డానతిచ్చిన చందమున వర్తింపు” మని యాదేశించిన పితృవాక్యంబుఁ దలచి మునితల్లజు శాసనంబు నెఱవేర్ప శ్రీరాముఁ డంగీకరించి యనుజు సహితంబుగ నాయత్తుఁ డాయెను. ఇంతలో మనుజుల యలికిడి విని కఠోర స్వనంబున నార్చుచు రయంబున వచ్చి తాటక రామలక్ష్మణులఁ గవిసెను. విశ్వామిత్రు ననుమతంబున కోదండంబుల నెక్కిడి సమర సన్నద్ధులై యున్న దాశరథు లా తాటక సమీపించి నంతనే నిశిత మార్గణంబుల దాని నొప్పించిరి. మాయామయ యగు తాటక రాఘవుల శరాపాతంబునకు నొచ్చి కోపారుణిత నయనయై నిష్ఠుర శిలాపాతంబున నా రాఘవుల ముంచెను. ఎడతెగని యా శిలావర్షంబున కించుకైన జంకక యా రాజనందను లిక్ష్వాకు రొక్కపెట్టున నిశితమార్గణంబుల దానిఁ గప్పిరి. ఆ నిశిత శరాహతి కది యుక్కిరి బిక్కిరి యగుచుండ తక్షణమే రాముఁడు దాని కరయుగళంబులు ఛేదించెను. తోడనే సౌమిత్రి దాని నాసికా కర్ణంబులు ఖండించెను. స్త్రీ వధంబు సేయనేరక నంగాంగంబు ఛేదించెడు రాఘవులఁ గని కౌశికుఁడు “రామా! ఇది స్త్రీ” యని యించుకైన దయచూడకుము. సాధుజన పీడాసక్తయు, బహు యజ్ఞహంత్రిణియు నైన యీ రక్కసి దయనీయ గాదు. ఇద్దానవిని వధించుట కిదియే సమయము. ప్రొద్దుగ్రుంకె నేని దీనిని వధింప నైతి గాదు. శీఘ్రమే సంహరింపు మని హెచ్చరించెను. అనిన

మహోగ్రంబైన సాయకంబొంటు లక్ష్యంబుఁ జూచి శ్రీరామచంద్రుఁ డా రాక్షసి వక్షంబున గాఢంబుగా నాటనేసెను. భయంకరంబగు నా శరాఘాతంబునకు మహోగ్ర స్వనంబున నార్చుచు విగత జీవయై తాటక నేలఁ గూలెను. జగత్కంటకి యైన తాటక యిట్లు రామచంద్రుని బాణాహతిఁ దెగ మహాదానందంబుఁ జెంది కౌశికుఁడు శ్రీరాముని కౌగలించియు శిరంబు మూర్కొనియు, మేను నిమిరియుఁ దన ప్రేమపారవశ్యంబును బెక్కుభంగుల వెల్లడింపుచు "రామా! నీధైర్య విక్రమంబులఁ దెలిసికొన నే నియోగించినఁ దాటకా సంహారణంబనియెడి ప్రథమ పరీక్ష యందు జయంబు గంటివి. బహు కాలంబునుండి నిరుపయోగంబులై యున్న మదీయాస్త్రంబులు సార్థకంబు సేయఁజాలు సత్పాత్రునిఁ గాంచుటచే నేఁ గృతార్థుండనైతి" ననెను. ఆరేయి రామలక్ష్మణులతోఁ గౌశికమునీంద్రుఁడు తాటకా వనంబునందే విశ్రమించెను.

మఱునాఁడు వఱువాత లేచి కాల్యకరణీయంబులు దీర్చుకొని కృతస్నాతులైన వెనుక విశ్వామిత్రుఁడు శ్రీరామచంద్రునిఁ గని రామా! నీ ధైర్యసాహసంబులు నా కానందమును గూర్చినవి. కాన బహుకాలంబునుండి నాకడ నిరుపయోగంబై యున్న ధనుర్వేదమును నీ కొసంగ వాంఛించుచున్నాను. దివ్యమైన యీ విద్యను బడసితివేని దేవదానవ యక్ష మర్త్య గరుడ గంధర్వ సిద్ధ విద్యాధరాదులం దెవ్వరును నిన్ను మాఱ్కొనఁ జాలరు. ఎట్టి బెట్టిదుండగు శత్రువు నైనను నీవు మట్టుపెట్టఁ జాలుదువు. ఎల్లరకును నీ వజేయుండ

వగుదు వచ్చెను. అనిన వినమ్రుఁడై శ్రీరాముఁడు సంయమిదత్తా స్త్రంబుల గొనుట కంగీకరించెను. అంత విశ్వామిత్రుఁడు శ్రీరాముని గని జలంబు లాచమనంబు సేయ నియోగించి నానావిధ చక్రంబులు, పాశంబులు, శస్త్రంబులు, నస్త్రంబులు, శక్తులు, నశనులు, గదలు నాదియగు దివ్యాస్త్రంబులెల్లఁ బ్రయో గోపసంహార పూర్వకంబుగా నొసంగెను. కౌశికు నాజ్ఞాన సారంబుగా నా మహనీయాస్త్రంబులెల్ల శ్రీరాముని వశమై నిజరూపమున బ్రత్యక్షమై యాతనికిఁ బ్రణామంబుఁ జేసెను. శ్రీరాముండును నా మహనీయాస్త్రంబుల నెల్ల వాత్సల్య పురస్సరంబుగాఁ గరంబుల స్పృశించి యోదివ్యాస్త్రంబులారా! నాకు మీతో నెప్పుడు పనిగల్గునప్పుడు మిమ్ముల స్మరింతును. ఇప్పుడు మీ మీ నెలవులకుఁ జనుడని యాజ్ఞాపించెను. అవియు పునః పునః ప్రణామంబుల శ్రీరాముని యెడ తమకుఁ గల భక్తిని వెల్లడించుచు నిజావాసంబులకుఁ జనియె. తదుపరి శ్రీరాముఁడు గాధేయు ననుమతంబున నా మహనీయాస్త్రంబు లెల్లఁ బ్రయోగోపసంహార పూర్వకంబుగా లక్ష్మణున కుప దేశించెను. ఇటుల విశ్వామిత్ర మునివరు ననుగ్రహంబున ననన్య దుర్లభంబు లగు దివ్యాస్త్రంబులఁ బడసి రామలక్ష్మణు లుజ్జ్వలులై విలసిల్లిరి.

అయిదవనాటి యుదయంబున రాఘవ సమేతుండగు కౌశిక మునీంద్రుఁడు సిద్ధాశ్రమం బని ప్రసిద్ధంబైన నిజాశ్ర మంబున కరుదెంచెను. ఆశ్రమస్థులౌ మునివరు లెల్లరు దాశ

# పదునైదవ ప్రకరణము

రథీ సమేతుండగు విశ్వామిత్ర మునీంద్రునకు పరమభక్తి విశేషంబుల స్వాగతం బొసగి యథార్హపూజనంబుల సత్కరించిరి.

---

# పదునారవ ప్రకరణము.

నిజాశ్రమంబు ప్రవేశించిన వెంటనే విశ్వామిత్ర మునీంద్రుఁడు మహామును లెల్లర రావించి యజ్ఞదీక్షితుండై మౌన నియతిఁ బూనెను. యాగకార్య నిర్వహణాదక్షు లగు మహర్షులు కొందఱు యాజ్ఞిక హోత్రాధ్వర్యోద్గాత హోతాద్యధికారంబులు వహించి యజ్ఞంబు నడపుటకుఁ బూనిరి. అంత రామలక్ష్మణులు శర శరాసన ధారులై వచ్చి మహర్షులకుఁ బ్రణమిల్లి మహాత్ములారా! నిశాచరు లే సమయంబున నరుదెంతురో యెఱింగించితి రేని యా సమయంబు నేమఱక యజ్ఞవేది గాపాడెద మనిరి. అనిన మహామునులు వారింగని "కుమారులారా! ఆ రాత్రిచరుల కొక సమయంబు లేదు ఏ సమయంబుననైన నాకస్మికంబుగా వచ్చి పైఁబడి యజ్ఞభంగంబు గావింతురు. కాన నీ వేళా వేళనక నేఁడు మొదలాఱహోరాత్రంబులు సవనవేదిఁ గాపాడవలయును. ఏడవ నాఁటి పూర్ణాహుతితో సప్తతంతువు సమాప్తం బగు" నని పల్కిరి. "సరి యజ్ఞవేది మేము గాపాడెదము. నిర్భయులై యాధ్వర కర్మంబులు నిర్వర్తించుకొను" డని శ్రీరాముఁడు మౌనులకుఁ బల్కి సోదర సహితుఁడై సవన రక్షణంబునకుఁ బూనెను.

అహోరాత్రంబులు ధనుష్పాణులై రామలక్ష్మణులు యజ్ఞవేదికఁ గాపాడుచుండ నైదు దినంబులు నిర్విఘ్నంబుగాఁ గడచిపోయెను. ఆఱవనాఁడు శ్రీరాముఁడు సౌమిత్రింగని లక్ష్మణా! నేఁడు కడపటి దినము. నేఁడే వేళనైన యాగ వేదిని, జెఱుప, రజనీచరులు పొంచియుందురు. ఈ దినము కడు జాగరూకులమై యుండవలయును సుమా యని హెచ్చరించెను. అగ్రజు హెచ్చరిక లక్ష్మణుఁడు శిరసావహించెను. బాణ తూణీర ధరులైన రాఘవులు యాగవేదిఁ గాపాడుచుండిరి. హోమాగ్ని యుజ్జ్వలముగఁ బ్రజ్వరిల్లుచుండెను. ఋత్విజులు యుచ్చైస్స్వనంబున మంత్రంబులు పఠించుచుండిరి. అగ్నికల్పుఁడైన విశ్వామిత్రుఁడా యాగవేది కడ ప్రగాఢ దీక్షతో మౌన వ్రతుఁడై కూర్చుండి క్రతు కర్మంబులు నెఱపుచుండెను. ఇంతలో నాకస్మికంబుగా గగన తలము భేదిల్లునట్లు లోక భయంకర నినదంబు వినవచ్చెను. తోడనే మాయావులైన మారీచ సుబాహులు శాంబరీ ప్రభావంబున నగోచరులై యసంఖ్యాక దైత్యానుచరులతో నరుదెంచి రక్తవర్షంబుతో సవనవేదికను ముంచివేయ దొరకొనిరి. ఆ సంరంభం బాలించి భయవిహ్వలులై మునులు రామా! "వచ్చిరి" "వచ్చిరి" యని యాక్రోశించిరి. తక్షణమే శ్రీరాముఁడు "లక్ష్మణా! ఈదుష్ట నిశాటులఁ బ్రభంజనుఁడు జీమూత తండంబులఁ జెదరగొట్టునటుల నరాస్త్రంబునఁ బాఱఁగొట్టెదఁ జూడు మని మహోగ్రరోషంబున నరాస్త్రంబు విల్లున సంధించి మారీచుని వక్షంబున గాఢంబుగా నాటనేసెను. అమ్మానవాస్త్ర పాతంబునకు

మారీచుఁడు గాలికెగురు దూదిపింజవోలె శతయోజనంబు లెగిరి సంద్రంబునఁ బడియె. అట్లు సోదరుఁడైన మారీచుఁడు రామ శరాఘాతంబున మహోదధింబడ కోపించి సుబాహుఁడు రాముపై గవిసె. ఆగ్నేయాస్త్రంబున రాముఁడు వానిఱొమ్ము పగులగొట్టెను. మహోగ్రంబైన యా శరాహతికి గతాసుఁడై సుబాహుఁ డప్పుడే నేలఁ గూలెను. శేషించిన రాక్షసానీకంబులు రామలక్ష్మణుల వాయవ్యాస్త్రంబులకు గుఱియై మ్రందిరి. హతశేషులు కాందిశీకులైరి. ఇట్లు శ్రీరాముని యద్భుత విక్రమంబున సాధుజన పీడాకరులును, బహుయజ్ఞ విధ్వంసకులును నైన దుష్టనిశాటులు హతంబు నొంద హర్షించి సురలు శ్రీరామునిపైఁ గుసుమ వర్షంబుఁ గురిపించిరి. దేవదుందుభులు మ్రోగె. "రామా! నేఁటికి జగత్కంటకులైన నీ దైత్యులఁ బొలియించి మము రక్షించితివి. నీ యనుగ్రహంబున మరల మామా జపహోమంబుల నిర్విఘ్నంబుగా నెఱవేర్చుకొనెడి భాగ్యంబు గంటిమని మునివరు లెల్లరు మహామోదంబున శ్రీరాముని శ్లాఘించి దీవించిరి. అంత సవనంబు సమాప్తమయ్యె. మఱునాఁడు పూర్ణాహోమంబును నెఱవేతె ఇట్లు నిర్విఘ్నంబుగా యజ్ఞంబు పరిసమాప్తమైన మౌనంబు వీడి కౌశికుఁడు మహామోదంబున శ్రీరాము నాలింగన మొనర్చుకొని "శ్రీరామచంద్ర! నీవంటి శిష్యోత్తముని బడయుటచే నా గురుత్వంబు సార్థకం బయ్యె. నేఁ గృతకృత్యుండ నైతిని. నా ధనుర్వేద మర్హాపూజ్యతను బడసె. నా సవనంబు ధన్యమైయ్యె. నా యాశ్రమతలంబు

పావనమయ్యె. శ్రీరామా! తుత్రివ్వఁ బట్టిన నా దివ్యాస్త్రంబు లెంత కాలమున కర్హ విక్రముండవగు నిన్నుఁ బొంది ధన్యమైన వోయి” యని పలుభంగుల శ్లాఘించి మితి లేని తన సంతసమును వెల్లడించెను. సవనంబు సమాప్తంబగుట వలన నా దినంబు సరసాలాపంబులతో సుఖంబుగాఁ గడపి దాశరథులా రేయి హాయిమనిఁ బవ్వళించిరి.

---

## పదునేడవ ప్రకరణము.

విశ్వామిత్రుని యానందమునకు మేర లేదు. శ్రీరాముని పై యాతని కుదయించిన వాత్సల్యమునకుఁ బారములేదు. ప్రియాభ్రాతృద్వైన శ్రీరామచంద్రుని కింకను నెన్నేని శుభంబులఁ గూర్చ నాతని ప్రేమతరంగితాంతఃకరణంబు వ్విళులూరుచుండెను. గాధేయుఁడు వఱువాత లేచి యీ విషయమును గూర్చియే యోచించుచుండెను. ఇంతలో మిథిలాధిపతియైన జనకుని పంపున మనుష్యు లరుదెంచి మహాత్మా! మా ప్రభువైన జనకమహారాజు యాగంబు సేయుఁబూని సిద్ధాశ్రమస్థులా మునివరుల తోడను, శిష్యుల తోడను మిమ్మందుల కాహ్వానింపఁ బంపి” రని విన్నవించిరి. రాజానుచరులు వచ్చి యిట్లు విన్నవింప జనకమహారాజు మందిరమున గల హార కోదండంబు శ్రీరామునకుఁ జూపుటకై మున్నే యోచించుచున్న గాధేయుఁ డా రాజేంద్రుని కడ నుండి తలవని తలంపుగ యాహ్వానంబు వచ్చుటచే రోయుతీఁగఁ గాళ్ళబెనగినట్లు

మిగుల సంతసించి "జనకమహారాజుత్తమః ధర్మనిష్ఠుఁడు పరమ తత్వజ్ఞనిధి. మహనీయుండైన యాతని సవనంబు గన నేగు టవశ్య కర్తవ్యం" బని నిశ్చయించి రాముని గని "రామా మిథిల దేశాధిపతియైన జనకమహారాజు యజ్ఞంబు సేయ బూని మమ్మందులకు బిలువనంపెను. మహనీయంబగు నయ్యాగ సందర్శనమునకు నే నరుగదలచితిని రామా! ఆ జనకభూపతి మందిరంబున దివ్యకోదండంబొండు గలదు దానిని మోపెట్టు టకు మానవుల మాటయేమి త్రిదశులే చాలకున్నారు. ఆ విల్లు మోపెట్టు కుతూహలంబున నెందఱో రాజనందను లరు దెంచి విఫలులై చనిరి. కాన నసదృశపరాక్రముండ వగు నీవు మాతో నటకరుదెంచి మహనీయంబగు నా ధనువును సందర్శించెదవే" యనెను. అనిన వినయ వినమితోత్త మాంగుఁడై శ్రీరామచంద్రుఁడు మహాత్మా! మీ రెట్లు లాజ్ఞా పించిన నవ్విధంబున వర్తింప మా జనకుఁడు శాసించె. కాన నా కోదండ శ్రేష్ఠంబు నుఁ జూపుఁ గుతూహలంబు తమకుఁ గలదేని తప్పక మీ వెనువెంట ననుజ సహితుండనై యరు దెంచెదను. గురుఁడు నిర్దేశించిన విధంబున నడుచుకొనుట శిష్యధర్మంబు గాదే?" యనెను అనిన రామచంద్రుని విన యభాషణంబులకుఁ గరంబలరి విశ్వామిత్రుఁడు శిష్యసమే తుండై మిథిలకుఁ జనదలంచెను. అసంఖ్యాక మౌనులు సాగ్ని హోత్రులై విశ్వామిత్రుని వెంట నరుదెంచుటకు యత్న పడిరి. క్షణములో సిద్ధాశ్రమము నిర్జనమును, నిశ్శబ్దమునునై యా మునితల్లజు వియోగమును సైపజాలమిని వెల్లడించెను.

పరమకారుణికోత్తముండగు విశ్వామిత్రు నెడఁబాయఁజాలక యాశ్రమస్థ ఖగమృగంబు లాతని ననుగమించెను. విశ్వామిత్రుఁడును భర్తృప్రవాసంబునకు వగచెడి సాధ్వివలె కళాహీనతచే నంగలార్చెడి యాశ్రమంబునకు బ్రదక్షిణించి నమస్కరించి వీడ్కొని చనవున వెంటాడి యరుదెంచెడి మృగపక్షి వితానంబులఁ బ్రేమంపు నుడువుల నుపలాలించి నిలిపి రామలక్ష్మణులును మునీంద్రులును వెంటరా మిథిలా నగరంబునకుఁ బయనమయ్యెను

ఇటుల మునిశిష్య సమేతంబుగ బయలుదేరి యానాటి సాయాహ్నమునకు విశ్వామిత్రమునివరుఁడు శోణనదీ తటంబునకుఁ జని యారాత్రి యానిమ్నగా తీరంబున విశ్రమించెను. అప్పుడు నిఖిలదేవతా మధ్యంబున నాసీనుండైన దేవేంద్రుని వడువునఁ దమముందర నగ్రేసరుఁడై కూర్చున్న గాధేయునకు నమస్కరించి శ్రీరాముఁడు మహాత్మా! ఈ నదీ విశేషంబేమి? ఈతరంగిణీ తటంబున గల రాజ్యంబు లెవ్వి యని వినయంబున నడిగెను. అడిగిన ముదితుండై విశ్వామిత్రుఁడు రామా! ఈ శోణనదీతీర మస్మజ్జన్మదేశము. అస్మత్పితామహులైన కుశాంబ కుశనాభ, ధూర్తరజస, వసువు లనెడి వారిటనే తమతమ పేరుల రాజ్యముల నిర్మించుకొని జనరంజకముగఁ బాలించిరి. వారిలో రెండవవాఁడైన కుశనాభుఁడు మా తండ్రినిఁ గన్న తండ్రి. ఆతఁడే మహోదయ నగరమును నిర్మించెను. దానికే కన్యాకుబ్జమను నామాంతరము గలదు. ఆ నగరంబునకే మా తాత యనంతరము మా తండ్రియు, నాతనికిఁ దరు

వాత నేనును ప్రభులమైతిమి. అని నిజవంశ వృత్తాంతమును గాశికుఁడు వివరించెను. మఱునాఁడు వారు గంగా తరంగిణి జేరిరి. అట నమ్మహానదీ వృత్తాంతమును మరల శ్రీరాముఁడడుగఁ ద్రిభువన పావనియైన యా మహాపగను భగీరథుండు పుడమికిఁ దెచ్చిన విధంబును, దానికి జాహ్నవీ నామంబు వచ్చిన తెఱంగును నాదియా విశేషంబులెల్ల విశ్వామిత్రుఁడు వివరించెను. ఆమఱుదినమున జాహ్నవిఁదరించి గాధేయాదులు విశాలా నగరంబునకుఁ జనిరి. రాముఁడు మరల నా నగర విశేషంబు లేమని గాధేయునిఁ బ్రశ్నించెను. రాముని విషయ గ్రహణాసక్తికిఁ గరంబలరుచు విశ్వామిత్ర మునివరుఁడు దాని పుట్టుపూర్వోత్తరంబులెల్ల విశదీకరించెను. ఇప్పగిది మార్గంబునఁ దగిలిన నదీమతల్లులయు, వాని పరిసర రాజ్యంబులయు వృత్తాంతములను రామలక్ష్మణులకును మునులకును రమణీయ మంజుల మధురవచనంబుల వివరించి చెప్పుచు నాఁలుదినంబులకు విశ్వామిత్ర బ్రహ్మర్షి మిథిలానగరంబున కనతిదూరంబునఁ గల గౌతమాశ్రమంబు సమీపించెను. నిఖిలపాదప సమాశ్రయ రమణీయంబయ్యు నిర్జనంబైన యీ యాశ్రమ ప్రదేశంబుఁ గాంచి యచ్చెరువంది రామచంద్రుఁడు విశ్వామిత్రునిఁ గని మహాత్మా! ఈ పాడువడియున్న యాశ్రమంబెవ్వారి దని ప్రశ్నించెను. "రామా! ఈపుణ్యాశ్రమంబు నిరుపమ తపోవిభవుండగు గౌతమ మహర్షిది. అమ్మునీంద్రుని పత్నియైన యహల్య యింద్రునితో వ్యభిచరించిన కారణంబున నమ్మౌనిచంద్రుఁడాగ్రహించి యహల్యను, నమరేంద్రునిఁ బరుషంబుగా శపించి

యియ్యాశ్రమంబుఁ బాసి చనిమె. నాఁటగో లె మహనీయ బ్రిభావు లగు బ్రిహ్మవాదులతో విలసిల్లెడి యీ గౌతమా శ్రిమ మిప్పగిదిఁ బాడఁటి యున్నది. నిజపాప ఫలంబున శాపో హతయైన యహల్య యసదృశంబగు నిజసౌందర్యంబెల్లఁ గోల్పోయి యియ్యాశ్రిమాభ్యంతరంబున నిరాహారయు, ని స్తేజయునై పాషాణంబు పగిది పడియున్నది. రామా! తప స్వినియగు గౌతమపత్ని నిజపాప ఫలంబును బహుకాలంబు నుండి యనుభవించుచున్నది. పశ్చాత్తాపచిత్తయగు నియ్యువిదఁ నిఁక నుద్ధరించుట క ర్తవ్యంబు కాన పరమ పవిత్రంబైన నీ చరణ రజోలేంశబున నీ నాతికి శాపమోక్షం బొసంగుము. ఇది మహాత్ముం డగు గౌతమముని శాసనం" బని వచించుచు విశ్వామిత్రుఁడు రాముని కేలు కేలం గొని యాశ్రిమాభ్యం తరమునకుఁ గొనిపోయెను. పవిత్రుల పాదధూళి పతితుల నుద్ధరింప మహనీయౌషధము గదా! పరమపావనం బగు శ్రీరాముని పదపాంసులను సోకినంతనే శాపవిముక్తయై యహల్య నివురు వీడిన నిప్పుచందమున, మసి తొలఁగిన మాణిక్యంబు పగిది మబ్బెడలిన జాబిల్లి వడువున నకలంకయై నైజసౌందర్యంబున విరాజిల్లి మహామునులకుఁ బ్రిణమిల్లి శ్రీరాముని బహుభంగుల గీర్తించె. ఇంతలో గౌతమ మహ ర్షియు నట కరుదెంచె. అంత నా మునిదంపతులు పరమభక్తి తాత్పర్యంబుల నెల్లర కాతిథ్య మొసంగి ధన్యులైరి. మహ నీయంబగు శ్రీరాముని ప్రిభావంబు నకును, పతిత యగు గౌతమసతి నుద్దరించిన విశ్వామిత్రుని మహదార్యంబు

సకును మహర్షు లెల్లరు వారిని వేనోళ్ళఁ గీర్తించిరి. అనంత రము గాధేయుఁడు గౌతమాశ్రమంబు వీడి ముని శిష్య సహి తుండై మిథిలానగరంబుఁ బ్రవేశించెను.

---

## పదునెనిమిదవ ప్రకరణము.

మహనీయుం డగు విశ్వామిత్ర బ్రహ్మర్షి ముని, శిష్య సహితంబుగఁ దన నగరంబున కరుదెంచె నను వార్త వినగనే ముదంబుఁ జెంది జనక భూపాలుండు హితపురోహితామాత్య సమేతంబుగ నా గాధినందను నెదుర్కొనఁ జని యర్ఘ్యపా ద్యాది బహువిధ పూజనంబుల నాతని సంభావించి యాగ దేశంబునకుఁ గొనివచ్చి యమ్మహర్షి ని, తక్కిన మునివరులను, శిష్యులను యుచితాసనంబుల నాసీనుల గావించెను. ఇట్లు మహర్షి సమేతుం డగు విశ్వామిత్రుఁడు సుఖోపవిష్టుడైన వెనుక జనక మహీవల్లభుఁ డమ్మహర్షినిఁ గని మహాత్మా! మహామహిమాఢ్యు లగు భవదాగమనంబున నాజన్మము ధన్యమయ్యె. నా నగరంబు పావనమయ్యె. మన్మఖము పూజ్యంబయ్యె. మహనీయా! సాధిత బ్రహ్మపదస్థుఁడ వగు నీ వరుదెంచుటచే మాకు సర్వశుభంబులు చేకూరినట్టులయ్యె నని భక్తి గౌరవంబులఁ బ్రశంసించెను. రాజర్షి యగు జనక నృపాలుం డిటుల వచింప నలరుచు విశ్వామిత్రుఁడును నాతని కుశలంబు లడిగె. ఇట్లు పరస్పర క్షేమపరిశీలనంబులైన వెనుక సదస్యు లెల్లరు దమ్మో యాలోకింప వినయ వినమిత గాత్రులై

విశ్వామిత్రుని చెంగట నిలిచియున్న దాశరథులఁ గాంచి వారి యాకార సమగ్రతావిశేషంబులు తన మనంబు నాకర్షింప జనకభూవరుఁడు విశ్వామిత్రునిఁ గని "మౌని చంద్రమా! రూపంబున నశ్వినీదేవతల వలెను, విక్రమంబున సింగంపుఁ గొదమలవలెను నొప్పుచు నుడికిఁ గూడని పిల్లఁగూఁకటు లతో శర శరాసనధారులై యలరారెడి యీ సుందరా కారు లెవరు? వయోరూప చేష్టావిశేషంబుల నిర్వాచ్య విధంబున నున్న యీ కుమారులే తలిదండ్రుల బహుజన్మ సుకృత ఫలంబుగా నుదయించి" రని యడిగెను. పరమోత్సు కుఁడై జనకభూపతి యిట్లు పృచ్ఛింప కరంబలరుచు విశ్వా మిత్ర మునివరుఁడు "రాజేంద్రా! ఈ కుమారులు సూర్య వంశ దీపకుండైన దశరథ మహీజాని ముద్దుతనయులు. ఈ శ్యామలవర్ణుఁ డా ధరావిభుని జ్యేష్ఠసుతుఁడు. పట్టమహిషి యైన కౌసల్యాదేవి నోములపంట. ఈ స్వర్ణగాత్రుఁడు సుమి త్రానందనుఁడు. అతఁడు రామాభిధేయుఁడు. ఇతఁడు లక్ష్మ ణాఖ్యుఁడు. భాతృస్నేహంబునఁ జేసి యీ సౌమిత్రి యే యెడ నేని యన్న నెడఁబాయక సేవించుచుండును. మిథిలేశ్వరా ఈ రాజనందను లిరువురు సద్గుణంబులకుఁ బ్రోవులు; విక్ర మంబునకు తావులు; స్థైర్యంబునకు నెలవులు. వేయేల సమస్త విషయంబుల నొకరి నొకరు సమానులు ఇతరుల కసమానులు. దశ సహస్ర గజ సత్వ సంపన్నయైన తాటక యను రాక్షసాం గనను సోదరయుతుండై శ్రీరాముఁ డొక్కఁడే యుక్కడించెను. ఈ శ్రీరామచంద్రుఁడే మదీయ యజ్ఞవిఘ్న కరులై యరు

దెంచిన తాటకా నందనులైన మారీచ సుబాహులతోఁ బోరి మారీచుని యుదధిఁ గూలఁగొట్టి సుబాహునిఁ దునిమి మదీయ యజ్ఞంబుఁ గాచెను. ఈ రామచంద్రుని పదరజంబు సోకియే భర్తృశాపోపహతయై ధూళిఁ బ్రుంగిన బంగరు శలాకవోలెఁ బడియుండిన యున్న యహల్య శాపవిముక్త యయ్యె. ధరాధిపా! ఈ కౌసల్యానందనుని విక్రమ ప్రభావంబు లనేకంబులు గలవు. అవి యట్లుండె. మీ యాగారంబునఁ గల హరకోదండంబు నరయు వేడుక నీరాజనందనులు నా వెంట నరుదెంచి యున్నవారు సుమా” యనెను. బ్రహ్మర్షియైన విశ్వామిత్రుఁడు రామచంద్రుని మహా మహిమంబులు వివరింప జనక భూపతియు సభాసదులును ఆహా! ఈ కుమార సింహుని పరాక్రమం బింత గొప్పనే యని హర్షాశ్చర్యంబుల నందిరి. జనక మహీపతి పురోధయు, నహల్యానందనుండును నైన శతానందుఁడు తన జనని శాపమోక్షము నందెనను వర్తమానంబును విని మహాసంతోషంబు బొంగుచుఁ గౌశికమునీంద్రుని గనుగొని మహాత్మా! మీ మహనీయ కరుణచే మా జనని శ్రీరామచంద్రుని దర్శించి శాపవిముక్త యయ్యెనే? పరమ పూజ్యుఁడైన మా జనకుఁడు శాపముక్త యగు మా యమ్మను బరిగ్రహించెనే? నిజాశ్రమంబున కరుదెంచిన యీ రామ చంద్రుని మా జననీజనకులు యథార్థముగ సత్కరించి ధన్యులైరే? మా తలిదండ్రు లిట్టి సుఖస్థితిఁ బడయుట ‘సత్యమే, సత్యమే’ యని యాతురత మీఱఁ బ్రశ్నించెను. “నిజము శతానందా! శాపవిముక్తయైన మీ తల్లి స్వస్వరూప

మును బడసెను. మీ తల్లిని మీ తండ్రి పరిగ్రహించెను. వారిర్వురును మా కెల్లరకాతిథ్య మొసంగిరి. సమయ మతిక్రమింపకుండ నెల్లయుఁ జక్కఁజేసియే యియెడ కరుదెంచితిని. మాతృ దుర్దశా విషయక విచారమింక వీడు మని పశ్వాత్రుఁడు శతానందుని శంక తొలంగునట్లు దృఢంబుగాఁ బల్కెను. విశ్వామిత్రుఁ డిట్లు వచింప శతానందు డమందానందంబుఁ జెంది విశ్వామిత్రుని చరణంబులకుఁ బ్రణమిల్లి లేచి రామునిఁ గని రామా! నీకు సుస్వాగతము. మా యదృష్ట విశేషంబున విశ్వామిత్ర మునీంద్రుని వెంట నరుదెంచి మమ్ముఁ బునీతులఁ గావించితివి. ఈ విశ్వామిత్రుఁడు మహా ప్రభావసంపన్నుఁడు. నిజ తపోబలంబున బ్రహ్మపదంబును బడసిన మహామహిమాశాలి. మహాత్ముండగు నీతని చిత్తము తపోవ్యవసాయంబున నెంత కఠినమో; దీనుయెడ నంత మృదులము, ఆర్తరక్షణాసక్తత నీ మహనీయు డెన్నిగో మాఱులు మహత్తరంబగు నిజ తపోఫలంబును తృణంబుగా వర్జించినవాఁడు. ఈ తని శరణుజొచ్చి విఫలులైన వారీ త్రిభువనంబుల లేరు. వేయేల పతితోద్ధరణాసక్త చిత్తుండగుటనుగాదే యవ్యాజ వాత్సల్యముతో నిన్నిటకుఁ గొనివచ్చి మా తల్లి నుద్ధరించె. ఆహా! ఈ మహాత్ముని కృపాపరత నేమని వర్ణింతును? మహారాజగు త్రిశంకుడును, బాలుండగు శునశ్శేపుఁడును, పతిత యగు నహల్యయు నీ మహనీయుని యుదార కరుణచే నుద్ధరింపబడిరి. ఈ మహనీయుని గాఢశోధనంబుచే హరిశ్చంద్ర సార్వభౌముని సత్యదీక్ష జగద్వంద్య మయ్యెను.

కాన రామా! ఇట్టి మహామహిమాఢ్యుండును, సదయాంతః కరణుండును నగు విశ్వామిత్ర బ్రహ్మర్షి నీకు గురుండును రక్షకుండును నగుటచే నీవు ధన్యుఁడవని శ్లాఘించెను. విశ్వామిత్రుని మహామహిమంబు లిట్లు శతానందుఁడు వర్ణించి శ్లాఘింప సదస్యు లెల్లరు సంతోషిత స్వాంతులైరి. విశ్వామిత్ర శతానందాది మునివరులును జనక భూపతియు నిటుల నిష్టాలాపంబు లాడుచుండ సహస్కరుఁడు చరమశైలంబున విశ్రమించెను. సాయంసంధ్యానుష్ఠానంబులకై జనకభూవరుఁడు విశ్వామిత్ర మునీంద్రునికడ సెలవుగొని చనెను. విశ్వామిత్రాది మునీంద్రులును రాఘవులును దమ విడిదుల నారేయి సుఖంబుగాఁ బుచ్చిరి.

---

## పందొమ్మిదవ ప్రకరణము.

మఱునాఁడు ప్రత్యూషంబున లేచి యాహ్నికంబులు దీర్చుకొని హితపురోహితామాత్యపరిజన సమేతంబుగా నిండు కొలువుండి జనకభూపతి ముని శిష్య యుతంబుగ విశ్వామిత్ర మహర్షినిఁ గొలువుకూటమున కాహ్వానించి సముచిత రీతి సంభావించి సుఖోపవిష్టుంగావించి మహాత్మా! ఏమి యాజ్ఞ యనెను. అనిన గాధేయుఁడు రాజేంద్రా! ఈ కుమారసింహులినవంశ చూడామణు లనియు, నుత్తమ క్షత్రియకుల సంజాతు లనియు, జగన్నుత పరాక్రము లనియు, ఈ బాలవీరులు మహనీయంబగు హరధనువును జూడవచ్చి రనియు నిన్న నే చెప్పి

యుంటిని గదా కాన నీ రాకుమారుల కా చాపముం జూపు మనెను. అనిన వల్లెయని జనకావనీశుండా కోదండ వృత్తాంతము నిట్లు చెప్ప దొడంగెను. "మహాత్మా! మున్నొకప్పుడు ప్రజాపతియైన దక్షుండల్లుండైన భర్గునిపైం గోపించి యాతనికి హవిర్భాగము లేకుండ క్రతు వొనరించి హవిర్భాగంబులం గొన నిలింపుల నాహ్వానించెను. దివిజులు రుద్రునకుం గావింపంబడిన యవమానము గమనింపక తమ తమ హవిర్భాగంబుల గ్రహింప యత్నపడిరి. తన్నవమానించిన దక్షాధ్వరంబున హవిర్భాగంబుల గొన నేగెడి బృందారకుల సందడిం గని రుద్రుండు కోపించి నన్ను పరాభవించిన వాని కడ క్రతుభాగంబుల గొన నేగుచుంటిరా? ఏమి మీ సాహసము? మిమ్మెల్లర నిప్పుడే మట్టుంబెట్టెదం జూడు డని మహానీయంబగు తన యీ విల్లును మోపెట్టెను. మహోగ్రరోషంబునం దమ్మెల్ల సమయింప సమకట్టిన రుద్రుని రౌద్రమునకు బెగడొంది నిలింపులు "శంకరా! మా యపరాధము సైరింపు" మని చంద్రశేఖరునిం బ్రార్థించిరి. దివిజులటుల దీనంబుగా వేండికొన వారి యెడం బ్రసన్నుడై దర్పకారాతి యీ చాపంబు నా సుపర్వుల కొసంగి కైలాసంబున కరిగెను. నాంటగోలె యీ కోదండశ్రేష్ఠంబు దేవతలకడనే యుండ నా కేడుతరముల పూర్వుండగు దేవరాతుం డొక్క మహానీయాధ్వరంబుంజేసి దేవతల మెప్పించి వారి కడనున్న హరకోదండంబు దానిల్లడగాం గొనెను. నాంటినుండి యీ దేవధనువు మద్గృహంబున నిలువేల్పువోలె నర్చింపం బడుచున్నది.

ఇది ధనువు వృత్తాంతము. దానిని దాశరథులు చూడఁగోరు దురేని చూడనగును. కాని దానిఁ గూర్చిన మఱియొక సమాచారము గూడ కలదు. అది యేమంటివేని? మహర్షి సత్తమా! పూర్వ మొకప్పుడు నేను యాగంబొండు సేయ దలచి భూమి దున్నుచుండ యా నాగటిచాలున నా కొక బాల లభించెను. అప్పటి కనపత్యుఁడనుగా నున్న నే నా చిన్న కన్నెను గని మహానందంబుఁ జెంది యింటికిఁ గొనివచ్చి యా బిడ్డకు "సీత" యను నభిధేయం బిడి పుత్రికవోలెఁ బెంచు కొనుచు, వయోరూపగుణ విశేషంబుల నసదృశయగు నక్కన్యాకారత్నమున కనురూపవరునిఁ బడయ దుర్లభంబు గాగ నా కుమారిని వీర్యశుల్కగా నిర్ణయించి మద్గృహంబున గల శివచాపంబు నెవఁడు మోపెట్టు నాతనికి కస్మత్పుత్రికా రత్నము నొసంగెద నని వెల్లడించితిని. నాఁటనుండి యెందఱో రాజ నందనులు నా కుమారినిఁ బడయు వేడుక నా విల్లు మోపెట్ట నరుదెంచి విఫలురై యూరక నా కొమరితనిచ్చి వివాహము సేయుమని వేడఁ దొడంగిరి. అందులకు నే నొడబడకున్న నాపై నాగ్రహించి యెల్లరొక్క కట్టుగా నాతో నొక్క వత్సరంబుఁ బోరాడి యందును విజితులుగాక విఫల యత్నులై చనిరి. భవచ్ఛిష్యుఁడైన యీ శ్రీరామచంద్రుఁ డైనను మదీయ నిర్ణయము నెఱవేర్ప జాలునేని నయోనిజయైన మత్పుత్రికారత్నము సీతని కొసంగెదను. జనకుండిటుల వివరంబుగాఁ జెప్ప నటులనే యగుఁగాక మును ముందా విల్లు రాఘవులకుఁ జూపుమని విశ్వామిత్రుఁడనెను.

అనిన వల్లెయని జనకుండు నిజసచివులం గని యా విల్లును గొనిరండని యాజ్ఞాపించెను. అంతవారు రయంబున నగరికిం జని యయఃపేటికయందు భద్రంబై యున్న యా ధనూరత్నమును పేటికాసహితంబుగ బలవంతులగు నైదువేల జనులచే మోయించుకొని వచ్చి జనకమహారాజు ముందర నిడిరి. ఇడినంతనే జనకమహీపతి లేచి భక్తియుక్తుండై యా చాపంబునకుం బ్రణమిల్లి విశ్వామిత్రునిం గని మహాత్మా! ఏడు తరములనుండి మా మైథిలు లధిక భక్తి నర్చించు ధనూరత్నమిదిగో! కనుము? రాఘవులు దీనినిం జూడం గోరుదురేని చూపుమనెను. అనిన విశ్వామిత్రుండు రామునిం గని "రామా! చాపంబు నరయుమనెను. మహర్షి యిటు లాజ్ఞాపింపంగనే మహోత్సాహంబుం జెంది రామచంద్రుం డాయయః పేటికపైంగల మూతను దీసి కోదండంబును బరీక్షించి చూచి విశ్వామిత్రుని గని మహాత్మా! విల్లునంటి చూచితిని భవదాజ్ఞ యయ్యెనేని వెలికిం దీసి యెక్కిడిదువనెను. రామచంద్రుడిట్లు దృఢంబుగాం బల్క హర్షించి "చాలుదువేని మోపెట్టుమని విశ్వామిత్రుండనెను.

ఇట్లు మహర్షి యాజ్ఞాపింపగనే మహోత్సాహంబున రామచంద్రుండా వింటిని వెలికిందీయ నుపక్రమించెను. ఎంత యెంతటి బలశాలురగు రాజన్యులకేనిం గేలనెత్త దుర్లభంబైన యా చాపరత్నంబును సముత్సుకత వెలికిందీయ నుంకించు బాలసూర్యునిం బోలు నా బాలశూరుని సాహసం బెల్లర కాశ్చర్యంబు గొలుప సభాస్తారు లెల్ల రనిమిషనేత్రం

బుల నాతని గనుచుండిరి. "నాశిష్యుఁడీ శరసంధానంబునఁ గృతార్థుఁడయ్యెనేని నా గురుత్వంబు గురుతరంబగు. నే ధన్యాతముండ నగుదునని విశ్వామిత్రుఁడు తలంచుచుండె.

ఈ రాజనందనుఁడైన నా యభీష్ట మీడేర్చునో నీడేర్పఁడో వీర్యశుల్కయైన నస్మత్తనయ కెవ్వఁడు భర్తగానున్నవాఁడో, యని తల్లడఁబడు చిత్తంబున జనకుఁడు గనుచుండెను. కన్యకామణియైన సీతఁ గన్యకాంతః పురమునుండి నెచ్చెలులంగూడి శ్రీరాముని శరసంధానంబును మహోత్సుకతంగనుచు "కంజాత పత్రలోచనుఁడు" "ప్రసన్నవదనుఁడు" "మందహాస చంద్రికా విలసితాధరుఁడు" ఉత్తుంగభుజుఁడు" "విశాలోరస్కుఁడు" కాని కడునల్లనివాఁడే! విల్లు విఱచిన నేమగుదని మాటి మాటికిఁ జెలులు పరిహాసంబులాడ నులుకుచు వ్రీడాభరంబున విప్పారనిఁ గన్నులతో నా గౌసల్యా నందనుని మోమును దనివోని ప్రేమంబునఁ గనుచుండెను. ఇభ్యాంగినెల్ల రొక్క కన్నుగా బహుభావంబులఁ దన్నుఁ గనుచుండ శ్రీరామచంద్రుఁ డా పేటికాంతర్గతంబగు కోదండంబు నశ్రమంబునఁదీసి యాలీఢ పాదుండై విశ్వామిత్రుని వంకఁ గనియె. నేత్రసంజ్ఞా మాత్రంబుననే విశ్వామిత్రుఁ డనుజ్ఞ నొసంగెను. తక్షణమే రామచంద్రుఁడా కోదండం బఱచేత దిగిచి యాకర్ణాంతంబుగా నారిబిగింప నా రఘురాము దోర్బలంబున కోపకా దేవ ధనువు పెళక్కన విఱిగి రెండు ముక్కలయ్యెను. అకోదండ ఖండనంబునఁ గల్గిన బెడిదంపు టులివునకుఁ బుడమి వడంకె. విశ్వామిత్ర జనక భూపాల రామలక్ష్మణులు

దక్కఁ దక్కిన సభాస్తారులెల్ల విచేష్టులై మూర్ఛిల్లిరి. క్రిక్కిరిసిన సభాజనంబులతోఁ గోలాహలంబుగా నుండెడి యా మహాసభ నిర్జనప్రదేశమట్లు నిశ్శబ్దమయ్యె. ఒక్కింత తడవిట్లు గడవ క్రమక్రమంబుగా సభ్యులెల్లరు లబ్ధ సంజ్ఞులైరి.

పటిష్ఠంబైన యా హరధనువును బాల కరీంద్రము మృదు మృణాలమును విఱిచిన చందమున నశ్రమంబున ఖండించి యెప్పటియట్లులేమియు నెరని బాలకుని చందమున నిలిచిన రామచంద్రుని గని యమందానందంబుఁ జెంది జనక భూవరుఁడు నిజాసనంబునుండి దిగ్గున లేచివచ్చి యా కౌసల్యానందను గౌఁగలించుకొని రామా! నా పుత్రికను వీర్యశుల్కయని నిర్ణయించిన నా నియమంబు సెల్లె. అనన్య సామాన్య విక్రమోపేతుండవగు నిన్నుజామాతగాఁ బడయు భాగ్యంబు గంటినహా! ఏమి నా యదృష్టంబని యుప్పొంగెను. ఇఁక విశ్వామిత్రుని యానందము వర్ణింప నెవరితరము? మహాంబుధికైనఁ బారముగలదు. గగన తలమునకైనఁదుదిగలదు. వసుంధరా చక్రంబునకైన మేరగలదు. కాని విశ్వామిత్రుని యానందమునకు మాత్రము మితిమేరలును బారమునులేవు. ఆతఁడు ప్రేమపారవశ్యమున శ్రీరామునిఁ దరిజేర్చుకొని మూర్ధ మాఘ్రాణించెను. చుంచులు దువ్వెను. చుబుకంబు పుణికెను. చెక్కిళులు ముద్దాడెను. ఇంకను దనివోక కర్కశంబులగు తన కరంబుల నాతని వెన్నుదట్టుచు, మేను నిమురుచు, నవపల్లవములఁబోలు నాతని మృదుల హస్తంబుల నల్లనల్లనఁబట్టి ముద్దాడి రామా! నీ చిన్నిచేతులే యిట్టి పటిష్ఠ

ధనువును విఱిచినవే, పెద్దచేతులేక నెంతటి ఘనకార్యంబులు సేయఁజాలునో గదా, యని యక్కున గదియించుకొని యెన్నెన్నో విధముల నుపలాలించెను. గురుఁడొసఁగిన విద్యను సార్థకముచేసిన వాఁడే సచ్ఛాత్రుఁడు. నిజముగా నట్టి సచ్ఛాత్రుని బడసినపుడు విశ్వామిత్రున కానందము గాదా!

---

## ఇరువదవ ప్రకరణము.

తదుపరి హర్షనిర్భర చేతస్కుండగు విశ్వామిత్ర మహర్షిఁగని జనకభూపతి. మహర్షి సత్తమా! ఇఁక నాలసింపక నా పుత్రికను భవత్ప్రియ శిష్యున కొసంగి పరిణయంబు సేయవలయు. ఇది నాఁజేసికొనిన సమయమని విన్నవించెను. జనక భూపతి యిట్లు విన్నవింప సంతసించి విశ్వామిత్రుఁడు "రాజేంద్రా! అట్లే యగుఁగాక. కాని యీ విజయవార్తను, సీ కల్యాణోదంతమును మహారాజగు దశరథేశునకు మును ముందెఱిగించుట కర్తవ్యముగదా. సువిచారులగు బ్రాహ్మణుల బిలువనంపి శుభలేఖార్థములు వ్రాయించి యయోధ్య కంపుము"ని వాక్రుచ్చెను. మహర్షి యిట్టులానతీయ వల్లెయని జనక మహారాజు శ్రీరాముని విజయంబును, వివాహ వృత్తాంతంబును, శుభలేఖ వ్రాయించి వేదవిదులగు విప్రుల కొసంగి యయోధ్యకుఁ బుత్తెంచెను.

అట దశరథేశుండును రామలక్ష్మణుల విశ్వామిత్రునితోఁ బంపినదాది, వారి సుఖవర్తమానంబు దెలియకఁ

దల్లడ పడుచు, విశ్వామిత్రుని సామర్థ్యంబు దలఁచి ధైర్యంబు గొనుచు రామ ముఖారవింద "మెప్పుడు గందు నెప్పుడు గందు" నని శాంతి నెఱుఁగని స్వాంతంబుతో దిన మొక యుగంబుగా గడపుచుండె. ఇంతలో జనక మహారాజు బంపిన బ్రాహ్మణు లయోధ్యా నగరంబుఁజేరి తాము గొనివచ్చిన శుభ లేఖను దశరథ మహారాజున కందించిరి. దశరథేశుం డా లేఖ నందుకొని యందుల్లేఖితమై యున్న శ్రీరాముని విజయ వృత్తాంతమున కెంతయు నుప్పొంగి యా కమ్మనుగొని వచ్చిన భూసురుల కనేక ధన కనక వస్తు వాహనంబు లొసంగి సత్కరించి అంతఃపుర కాంతలకును పౌరజనంబులకును నాశుభ సమాచారం బెఱుక పఱచి తోడనే మంత్రి సామంత హిత పురోహితాది మహాజనంబుల తోడను, చతురంగ బలంబుల తోడను మిథిలానగరంబునకుఁ బయన మయ్యెను.

ఇట జనక మహారాజు యజ్ఞంబు సమాప్త మొందించి పుర ప్రవేశంబులుసేసి సీతాకల్యాణ యత్నంబులు సేయుచుండె. ఒక్కెడ పందిళ్ళ నిర్మాణ మొక్కెడ గృహాలంకరణ మొక్కెడ తోరణధ్వజాలంకార మొక్కెడ బంధుల యాగమనంబునై మిథిలానగరంబెల్ల సీతాకల్యాణ సంరంభ సన్నాహంబులతోఁ గోలాహలంబుగ నుండెను.

ఇంతలో దశరథ మహారాజరుదెంచె నను వార్త విన నయ్యెను. ఆ శుభవర్తమానంబు వినిన వెంటనే జనకమహారాజు సముచిత పరివారుండై కోసదేశున కెదురుఁ జని యథార్హపూజనంబులను బహు విధోపహారంబులను నాతని సంభా

వించి స్వాగతంబొసఁగి మంగళ తూర్యనినదంబులు భూన భోంతరాళంబులు భోరుకొన మహావైభవంబున గొనివచ్చి యొక్క దివ్యభవనంబున విడియించెను. దశరథమహావిభుని యాగమనంబు విని విశ్వామిత్రుఁడు రామలక్ష్మణులఁ దోడ్కొని వచ్చి యా మహారాజున కొప్పగించి యాతనిచేఁ బూజితుండై తన విడిపట్టుకుఁ జనెను. విజయభూషితులైన రామలక్ష్మణులఁ గని ముదితుండై దశరథ మహారాజా రేయి సుఖంబుగఁ గడపెను.

మఱునాడు వేగుఁబోక లేచి కృతాహ్నికులై వసిష్ఠ విశ్వామిత్రి వామదేవాది మహర్షి పురస్సరంబుగ నయోధ్యా మిథిలాధి నాథులు కొలువుదీఱి పరస్పర వంశక్రమంబు లెఱిగించుకొని యయోనిజయైన సీతను శ్రీరామచంద్రునకును, జనకుని కన్నబిడ్డయైన నూర్మిళను లక్ష్మణునకును బాణిగ్రహణంబు సేయునట్లులు నిశ్చయించుకొనిరి. అట్టియెడ వసిష్ఠ విశ్వామిత్రు లిరువురును యోజించి జనకమహారాజున కిట్టు లనిరి. "రాజేంద్రా! సూర్యచంద్ర వంశంబుల నుద్భవించిన రాజన్యచూడామణు లగు మీ కిరువురకును నెయ్యంబున వియ్యంబు గుదురుట యెంతయు నొప్పిదంబుగా నున్నది. నిరతిశయగుణ శోభితులగు రామలక్ష్మలకు సీతాయూర్మిల లెంతయు ననురూప గుణాఢ్యలై వధువులగుట నిక్కువ మదియట్టు లుండె. మిథిలేశ్వరా! మఱియు నొక్క వక్తవ్యంబగు విషయంబు గలదు. ఏమంటివేని? ఈ దశరథేశుని కొమారులు నల్వురు విద్యయందును, బుద్ధియందును, ప్రాయమందును,

రూపమందును, విక్రమందును, సౌదార్యమునందును నొక్క విధంబుగా నసదృశులు. కాన వీరు నల్వురు మీ యింటి యల్లుండ్రగుట మా యభిమతము. కాన మీ యనుజుండైన కుశధ్వజుని కొమార్తెలగు మాండవీ శ్రుతకీర్తుల భరత శత్రుఘ్నుల కొసంగి వివాహము సేయుము. బ్రహ్మర్షు లిరువు రిట్లు హితంబు మీఱఁ బలుక ముదితుండై మైథిలుఁడు "మహాత్ములారా! మునికుల తిలకులైన మీ రిర్వు రిట్లు లొక్క మాటగా నా కన్యల కనురూప వరనిర్ణయంబు సేయ నేను గాదందునే? మీ యానతి చొప్పున మాండవీ శ్రుతకీర్తుల భరత శత్రుఘ్నులకుఁ బరిణయంబు సేయ నంగీకరించితి" ననెను. ఇవ్విధంబుగా దాశరథుల నల్వురకు వైదేహుల నల్వుర నొసంగి వివాహము సేయుటకు నిశ్చయించిన వెంటనే వసిష్ఠ విశ్వామిత్రు లిర్వురు యోజించి మఱునాఁడే రాఘవుల వివాహంబులు జరుగునట్లు ముహూర్త నిర్ణయంబు జేసిరి.

మఱునాఁడు మంగళతూర్య నినదంబులు సెలంగ మేల్కొని దశరథేశుఁడు వసిష్ఠాది మహర్షుల రావించి రాఘవులఁ బెండ్లికొమారుల సేయ నియమించిన వారును రాఘవుల మంగళస్నాతుల గావించి పెండ్లికొమరుల జేసి స్నాతక వ్రతంబు జరిపించిరి. అంత మంగళ తూర్యనినదంబులును, మహర్షుల స్వస్తివాచనంబులును, వైవాహిక మహోత్సవ దర్శనా కుతూహలులైన పౌరజనంబుల కోలాహలంబును నేకమై మిన్నుముట్టఁ గుమారయుతుండై కోసలేశుఁడు మహావైభవంబున వివాహవేదికఁ జేరెను అట జనకభూపతియుఁ గన్యల

నల్వుర నమూల్యవస్త్రాభరణ భూషితులఁ గావించి యక్కన్యకాయుతుఁడై శతానందాది పురోహితులు దోడరా వివాహవేదిం బ్రవేశించె. అంతఁ గౌశిక శతానందాదులు సహాయులుగా కులపతియైన వసిష్ఠుఁడు రాఘవులఁ బెండ్లిపీట లపైఁ గూర్చుండఁజేసి వైవాహిక క్రియాకలాపంబెల్ల యథా విధి జరిపించి వేదవిదులైన విప్రుల యాశీర్వచనంబులును, పుణ్యాంగనల మంగళగీతంబులును, వాద్యంబుల ఘోషణం బులును సెలంగుచుండ జనకభూపతిచే సీతను శ్రీరామునకు దానంబు సేయించె. ఇట్లు శ్వశురదత్తమంత్ర పూర్వక దాన ధారాసహితంబుగ సీతనుగ్రహించి శ్రీరాముఁడు తటిల్లత తోడిజలదంబున విరాజిల్లె. ఇవ్విధి సీతా పాణిగ్రహణంబైన వెనుకఁ గ్రమంబున నూర్మిళను లక్ష్మణునకును, మాండవిని భరతునకును, శ్రుతకీర్తిని శత్రుఘ్నునకును కన్యాదానంబు సేయఁబడియె. ఇప్పగిది రాఘవులు నల్వురు మైథిలలఁ బరిగ్ర హించి రోహిణీయుతుఁ డగు సుధాకరుని చందంబున నోకో కరు దర్శనీయులై వెలింగిరి.

బ్రహ్మర్షియైన విశ్వామిత్రుఁ డిట్లు ప్రియశిష్యుఁడై శ్రీరామచంద్రున కుత్తమాస్త్రంబులనే గాక యుత్తమ సతినిఁ గూడ సమకూర్చి సఫలీకృత మనోరథుండయ్యెను. ఆహా! విశ్వామిత్రుని శిష్యవాత్సల్యం బనుపమానము గదా! దాశ రథుల వివాహమైన మఱునాఁటి ప్రభాతంబున విశ్వామి త్రుఁడు వధూవరుల దీవించి దశరథ జనక మహీవల్లభు లాతఁడు తమకుఁ గావించిన మహోపకృతి కధికంబుగా

శ్లాఘించుచు ఘనంబుగా వీడ్కో లుపహిమాచల సవిధంబున కరిగెను.

మహనీయంబగు నిక్కార్యంబులు నెఱవేర్చిన వెనుక విశ్వామిత్రుఁడు మరల జగద్రంగమునఁ బొడసూపలేదు. అథవా యే సందర్భముననైనఁ గనుపించినను లౌకికంబులఁ జొరలేదు. కాన మహాప్రభావసంపన్నుఁ డగు విశ్వామిత్ర మహర్షి చరిత్ర మింతటితోఁ బూర్ణ మయ్యె నని చెప్పవచ్చును. మహాత్ముం డగు విశ్వామిత్రుని యకుంఠిత కార్యదీక్షయు, నపార ధర్మతత్పరతయు, నస్వార్థ దీనరక్షణా శీలతయు, ననన్య సామాన్య కరుణా పారీణతయు, ననదృశ శిష్యవాత్సల్యతయు, భారతీయులకుఁ గలకాలమాదర్శపాత్రమై వెలయుగాక!

—* సంపూర్ణము *—





సరస్వతీ ముద్రాక్షరశాల, గుంటూరు. మే–1933 సం||